22-1-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక :4 విడిప్రతి : రు. 2.00 లు
Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



**పాణ్యం ఎన్నిక - జరగనివ్వమని పలికిన ప్రగల్భాలు పరువు తీశాయి! ఇప్పుడు ఎన్నిక జరిగిపోతూంది, వేసిన కేసు విత్‌డ్రా చేయవలసివచ్చింది కనీసం పోటీ పెట్టడానికి క్యాండిడేట్ కూడా దొరకక ఎగతాళి ప్రాయమౌతూంది!**

# నవ్వుల పాలైన తెలుగు దేశం!

పాణ్యం ఉపఎన్నికలో తల దూర్చి తెలుగుదేశం అనవసరంగా అభాసు పాలైంది. పార్టీ పుట్టి పదేళ్లయినా, ఏడేళ్ల పరిపాలనానుభవం వున్నా రాజకీయ పరిణతి విషయంలో అగ్రనాయకుల నుంచి క్రిందిస్థాయి వరకు ఇంకా పాలుత్రాగే ప్రాయం దాటలేక పోతున్నారని రుజువు చేస్తున్నదీ ప్రహసనం.

విజయభాస్కరరెడ్డి ఉప ఎన్నిక విషయంలో ఎన్నికల కమిషనర్ శ్రీ శేషన్ చెప్పిన అభ్యంతరం తెలుగుదేశం నాయకుల చెవికి అమృత వాక్యాల వలె విన్పించాయి. ఆ ఎన్నిక నిల్చిపోతే విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రిత్వాన్ని వదిలేయవలసివస్తుందని, అది కాంగ్రెస్ పార్టీ భవిష్యత్‌కు గొడ్డలి పెట్టువలె పరిణమిస్తుందని వారు సంబర పడ్డారు. వెనుకోవడంలో వారు పెద్ద పొరపాటు చేశారు. ఎన్టీఆర్ అవినీతిపైన కేసులపై కేసులు వేసి, ఐదేళ్లపాటు న్యాయపోరాటం చేసిన వ్యక్తి, ఎన్టీఆర్‌కు అనుగుణంగా కేసు దాఖలు చేయడం ప్రజలలో ఎగతాళి ప్రాయమైంది. రామచంద్రరావుకు అది వృత్తి ధర్మమైనా, చంద్రబాబు నాయుడు ఆయన దగ్గరకు వెళ్లి, కేసు దాఖలు చేయమని కోరడం పార్టీలోని విమర్శలకు దారితీసింది. కేసు అడ్మిట్ కాకమునుపే విత్‌డ్రా చేయాలన్న నిర్ణయం తీసుకోవడంతో పార్టీయే నవ్వుల పాలైంది. కేసు ఉపసంహరణకు వారు చెప్పే కారణాలు సహేతుకంగా లేవు. ఎన్నిక నిలపడానికి రిట్ దాఖలు చేసినప్పుడు, ఎన్నికల కార్యక్రమం ప్రకటించినా విత్‌డ్రా చేయనవసరంలేదు. ప్రయత్నించారు. కాని ఎవరూ ముందుకు రాలేదు. ఇప్పుడు ఎవరు దొరికినా పెట్టాలని చూస్తున్నారు. కాని కర్నూలు జిల్లా రాజకీయాలు అంతసులువైనవి కావు. అందులోనూ విజయభాస్కరరెడ్డికి బద్ధ శత్రువైన కెఇ కృష్ణమూర్తి సైలెంట్ కావడమే కాక, మద్దతునివ్వడానికి కూడా ముందుకు రావడంతో ఇక ఎవరూ సాహసించి తెలుగుదేశం జెండా పట్టుకోలేక పోతున్నారు. విజయభాస్కరరెడ్డిని హతమార్చాలన్నంత కసితో కొంతకాలం, తనను హతమారుస్తాడేమోనన్న భయంతో ఇంకొంతకాలం గడిపే కృష్ణమూర్తి ఒక్కసారిగా సాధు జంతువై పోయి, సామరస్యంగా మెలగడం కర్నూలు జిల్లాలో అనూహ్యమైన పరిణామం. ఇటు పోటీకి అభ్యర్థి దొరకక, అటు కేసు

అందువల్లే పాణ్యం ఉప ఎన్నికకు బ్రేక్ వేయడానికి హైకోర్టులో కేసు దాఖలు చేయాలని నిర్ణయించారు. ఏమి చేసైనా సరే ఈ ఉప ఎన్నిక జరగకుండా నిలపాలన్నది వారి పట్టుదల. కోర్టు ఉత్తర్వుల మేరకు మే నెలలో జరగవలసిన పంచాయితీ ఎన్నికలను ఓటర్ల జాబితా సవరణ సాకుతో నవంబరులో కాని నిర్వహించలేమని రాష్ట్ర ప్రభుత్వం హైకోర్టులో దాఖలు చేసిన అఫిడవిట్ వారిలో ఆశలు పెంచింది. దీని ప్రకారం పాణ్యం ఉప ఎన్నికను సైతం నవంబరుకు వాయిదా వేయాలని వారు కోర్టును కోరారు. ఈలోగా ప్రధాని ఒత్తిడి వల్ల శేషన్ ఏప్రెల్ మొదటి వారంలో ఎన్నిక జరపడానికి అంగీకరించారు.

అయితే హైకోర్టులో కేసు దాఖలు చేయడానికి శ్రీ ఎస్. రామచంద్రరావును ఎంపిక ఎన్నిక తేది వెలువడిన తర్వాత సైతం నిలిపివేసే అధికారం హైకోర్టుకు వుంది. తెరవెనుక ఏదో జరగబట్టే తెలుగు దేశం నాయకులు భయపడిపోయి, హడావుడిగా కేసు ఉపసంహరించి వుండాలి. అది ఏమైందీ ఒకటి రెండు రోజుల్లోనే తెలిసిపోతుంది.

ఈ అవమానం చాలదన్నట్లు, పాణ్యం స్థానంలో విజయభాస్కరరెడ్డికి పోటీగా నిలబెట్టడానికి తెలుగుదేశానికి అభ్యర్థి దొరకడం లేదు. మొదట సత్యంరెడ్డి అనే అభ్యర్థిని ఎంపిక చేశారు. విజయభాస్కరరెడ్డి ఏమి మాయ చేశాడో కాని, అతగాడు ఎన్టీఆర్ దగ్గర నుంచి నేరుగా ముఖ్యమంత్రి కార్యాలయానికి వెళ్ళి, తాను పోటీ చేయనుగాక చేయనని చెప్పి, వెళ్లిపోయాడు. ఈ పరిణామంతో హతాశులైన దేశం నాయకులు ఒక మహిళా అభ్యర్థిని ఎంపిక చేయాలని కొనసాగించే ధైర్యం లేక రెంటికీ చెడిన రేవడి అయిపోయింది తెలుగు దేశం పార్టీ. పాణ్యం ఎన్నిక ద్వారా కాంగ్రెస్‌ను చావుదెబ్బ తీయాలని వారు తలపెట్టారు; తమ కన్నే లొట్టపోయేటప్పటికి దిక్కుతోచక తనక లాడుతున్నారు.

## మంత్రివర్గ విస్తరణ?

వైఎస్‌కు కేంద్రంలో మంత్రిత్వం ఇప్పించడంలో విఫలమైన ముఖ్యమంత్రి ఇప్పుడు రాష్ట్ర మంత్రివర్గంలో ఆ వర్గానికి స్థానం కల్పించడం ద్వారా స్నేహ సంబంధాలు నెలకొల్పు కోవడానికి ప్రయత్నిస్తున్నారు. మొదట చేసిన ఆలోచన ప్రకారం, ఉప ఎన్నిక వరకు మంత్రి వర్గ విస్తరణ లేదు. ఎన్నికలకు ముందు అసంతృప్తులు రేకెత్తడం ఇష్టంలేక ఆయన విస్తరణ వూసు ఎత్తకుండా వుండిపోయారు. కాని ఇప్పుడు పరిస్థితి మారింది. అదే విస్తరణ మంత్రం ద్వారా అసమ్మతి తలెత్తకుండా నివారించాలన్నది ఇప్పటి ప్రతిపాదన. వైఎస్‌ను సంతృప్తి పరిస్తే, పాణ్యంలో ఎదురుండదు.

## "పలుకే బంగారమాయెనా?"

పాణ్యం ఉప ఎన్నిక గడబిడ పుణ్యమా అని కోట్లవారు యమ సీరియస్‌గా వుంటున్నారు. ముఖ్యమంత్రిని కలిసేందుకు వెళ్లే మంత్రులు, ఎంపీలు, ఎమ్మెల్యేలను కూడా ఆయన మొటమొటమంటూ రిసీవ్ చేసుకుం టున్నారు. మామూలుగానే కోట్లవారు మాట్లాడేది అంతంతమాత్రం; ఇప్పుడు మరీ "పలుకే బంగార మాయెనా" అన్నట్టుండడంతో సందర్శకుల పరిస్థితి దయనీయంగా వుంది. ఏమి చెప్పబోయినా ఆయన సీరియస్‌గా, అంటీ ముట్టనట్టు ఒకటి రెండు మాటలు మాట్లాడి పంపేస్తున్నారు. జనార్ధనరెడ్డి నయం. పనిచేసినా చేయకపోయినా నోటినిండా

కొరవ 7 పేజీలో

# పినాకిని తీరం

## షికారు కొట్టిన పుకారు !

భూమి ఎట్లా ఏర్పడింది మొదలు మానవ విజ్ఞానం వరకు సృష్టి రహస్యాలన్నిటినీ కనుగొన్నారు. చందమామ రావే జాబిల్లి రావే అంటూ గోరు ముద్దలు తినే వయసు నుండి ఏవేవో కథలల్లి మన రక్తంలో కలిసి పోయేట్లు మన వాళ్లు చంద్రుడికి ఆపాదించిన కథలన్నీ కల్పితాలని రుజావు చేసి ఆయన మొహాన్నే నడిచి వచ్చి తీశారు. నవగ్రహాలుగా శరీర పరిశ్రమకా అన్నట్లు భయభక్తులతో మన చేత ప్రదక్షిణాలందుకునే శుక్రుడు, బుధుడు, అంగారకుడు వగైరాలలో దైవత్వ ప్రభావాలేమీ లేవు భూమి వలె అవీ చిన్న పెద్దా గ్రహాలే అని తేల్చి వాటి మానం తీశారు సైంటిస్టులు. అగ్ని గోళంగా కోటానుకోట్ల మైళ్ల దూరాన వున్న సూర్యుణ్ణి చేరుకొని ఆయన సంగతి తేల్చుకోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉపగ్రహాలను ఆకాశంలోకి ప్రయోగించి రోజుకు అనేక సార్లు ప్రపంచాన్ని తొంగి చూపిస్తూ, దిక్‌దేశాల వార్తలు విశేషాలను ఏ క్షణానికి ఆ క్షణం సచిత్రకంగా మన కండ్లకు కడుతున్నారు. ఇవే కాదు, ఇటువంటి మహాద్భుతాలు ఎన్నింటినో ఈ తరంలోని మనం చూడగలుగుతున్నాము ఎన్నెన్నో విషయాల మీద చదువుల మీద చదువులు, పరిశోధనల మీద పరిశోధనలు జరిపి మూరెడు పొడవు డిగ్రీలను, డాక్టరేట్లను అనేక మంది పొందుతున్నారు.

గర్వించదగిన ఇన్ని ఘన కార్యాలను మన శాస్త్రజ్ఞులు, పరిశోధకులు విజయవంతంగా చేయగలుగుతున్నారు కాని, పుకార్ల పెట్టుక వ్యాప్తుల పూర్వోత్తరాల రహస్యాన్ని ఛేదించి ప్రజలకు వివరించ లేకున్నారే అనిపిస్తుంది. నిరాధారమైన నమ్మశక్యంగాని వార్తను ఎవరో ఒకరు రహస్యాన్ని మనకొక్కరికే చెప్తున్నట్లు చెవిలో వేస్తారు. ఎవరు చెప్పారు అని ప్రశ్నిస్తే, ఎవరో చెప్పారు అనేస్తారు. ఆ 'ఎవరో' ను కనుక్కుందామని బయలు దేరితే ఆ ప్రయాణానికి అది అంతం వుండదు; ఆ 'ఎవరో' ఎంత తంటాలు పడినా దొరకనే దొరకరు; ఆఖరుకు అంతా హుళక్కి అని తేలుతుంది; చెప్పిన వారు, విన్నవారు వెర్రి వెంగళప్ప లైపోతారు!

ఇది అన్ని చోట్లా వుండేదేననుకోండి – నెల్లూరులో ఈ పుకార్ల ప్రహసనాన్ని దశాబ్దాల పర్యంతం చూస్తూనే వున్నాం; విద్యుద్వేగంతో వ్యాపించే ఈ పుకార్లు ప్రజలను, ముఖ్యంగా రాజకీయ జనాన్ని వుత్సాహ నిరుత్సాహాలతో, ఆశా నిరాశలతో వుర్రూత లూపుతాయి, తికమక పెడ్తాయి. విశ్వసనీయమైన ఒక పెద్ద మనిషి చెబితే నమ్మక తప్పదు; పత్రికల వారమైతే అటువంటి వార్తలను చాపల్యం కొద్దీ ప్రకటిస్తాము; వార్తల పట్ల పాఠకుల అపనమ్మకాన్ని కొని తెచ్చుకుం టుంటాము! బ్రతికున్న జయప్రకాష్ బొంబాయిలో మరణం చాటంటూ ప్రధానిగా శ్రీ మొరార్జీ దేశాయ్ పార్లమెంటులో ప్రకటించి, ప్రజలను శోకపరితప్తులను చేశారు. చివరకు అది కేవలం పుకారేనని తెలిసి ఆయన నాలుక కొరుక్కున్నారు. పుకార్లనేవి ఎంత పెద్ద వారినైనా ఈ విధంగా బోల్తా కొట్టించి వేస్తుంటాయి; వాటి ప్రభావం, పలుకుబడి అంత తీవ్రమైన దన్నమాట!

నెల్లూరులో అటువంటి రాజకీయ వదంతి ఒకటి షికారు కొట్టింది. జనార్దన రెడ్డి కేంద్రంలో మంత్రి కాబోతున్నాడనే కాకుండా, ఫలాని పోర్టు ఫోలియోతో కాబోతున్నాడని, అసలాయనే చెప్పాడని ఆ నోట ఆ నోట పడి అంతా వ్యాపించి పోయింది. ఖాళీగా వున్నారు; కేంద్రంలో మంత్రి వర్గ పునర్నిర్మాణపు వార్తలు వస్తున్నాయి; ప్రధాని మొన్న తిరుపతి వచ్చినపుడు జనార్దన రెడ్డితో చాలా సేపు ఏకాంతంగా మాట్లాడాడు... అందువల్ల ఈ వదంతి నమ్మదగిందిగా వుంటుందనే నిర్ణయానికి వచ్చేశారు జనం. ఆయన అనుయాయులు వుత్సాహ భరితులయ్యారు. తీరా ఈ వారంలో మంత్రివర్గ విస్తరణ జరిగి, అందులో జనార్దన రెడ్డి పేరు లేకపోయేసరికి నీరు గారి పోయారు! జనార్దనరెడ్డి అనుయాయులు, అభిమానులే కాదు, ఎందు వల్లనో నెల్లూరులో రాజకీయేతరు లెందరో జనార్దన రెడ్డికి మంత్రిత్వం ఖాయమను కొన్నట్లున్నారు; రాకపోయేసరికి నిరుత్సాహపడ్డారు. ఎందువల్ల మంత్రిత్వం ఖాయమనుకున్నారు? పుకారు ఒక ప్రబల కారణమైతే, ఆయన కేంద్రానికి పోవాలనే ఆకాంక్ష పలువురిలో ప్రగాఢంగా వుండి వుండాలి. రెండూ చేరి నమ్మించాయి; వారి ఆశలను ముంచాయి!

"జనార్దన రెడ్డికి విస్తరణలో మంత్రిత్వం రాలేదే?" అని ఒకరు నన్ను సూటిగా ప్రశ్నించారు; వస్తుందని ఎవరు చెప్పారు? అని నేను ఎదురు ప్రశ్న వేశాను. తెల్లమొగం పెట్టారు. మొత్తానికి ఆధారం లేని వదంతి ఎంత పని జేసిందో చూడండి! ఇదే కాదు విజయభాస్కర రెడ్డి మళ్ళీ ఢిల్లీకి పోతారని, జనార్దన రెడ్డి తిరుగా ముఖ్యమంత్రి కాగలడని హైదరాబాదు వర్గాలే వూహించాయి. ఇదీ ఒక నిరాధారమైన వూహాగానం; వుబుసు పోక రాజకీయ కబురు అనుకోవాలి!

తాను ఈ విస్తరణలో మంత్రి అవుతానని జనార్దనరెడ్డి గారే అనుకోలేదు; ఆశించ లేదు. మనసులోని మర్మం ఏమో గాని, నెల్లూరులో వ్యాపించిన ఈ వదంతుల పై మేము జనార్దన రెడ్డి గారిని అడిగినప్పుడు ఆయన నేనే అనుకోలేదే, ఇతరులెట్లా వూహించారు అని జవాబు చెప్పారు. కేంద్రంలో మంత్రి కావాలంటె ఆరు మాసాలలోగా పార్లమెంటుకు గాని, రాజ్యసభకు గాని ఎన్నికయ్యేట్లుండాలి. ఎన్నికలకు సంబంధించి ఇప్పుడు రాజకీయ వాతావరణం సరిగాలేదు. విజయభాస్కర రెడ్డి గారి రాజీనామా అనంతరం కర్నూలు సీటుకు జరిగే పార్లమెంటు వుప ఎన్నిక ప్రజల వైఖరికి ఒక కొలమానంగా వుండవచ్చు. అదీ గాక, జనార్దన రెడ్డి మెడికల్ కాలేజీల నిర్ణయానికి వ్యతిరేకంగా వచ్చిన హై కోర్టు తీర్పు పై నైతిక బాధ్యత వహిస్తూ ముఖ్యమంత్రిత్వం నుండి వైదొలగారు. హై కోర్టు తీర్పు పై జనార్దన రెడ్డి సుప్రీం కోర్టుకు అప్పీలు చేసివున్నారు. ఆ తీర్పు వెలువడే వరకు ఆయనకు కేంద్రంలో పదవి ఇవ్వడం కుదరదేమో? తీర్పు తనకు అనుకూలంగా వస్తే ఎట్లా వుంటుందో, హై కోర్టు తీర్పే ధృవీకరింప బడితే ఏమవుతుందో – అప్పటి పరిస్థితులను బట్టి గాని, జనార్దన రెడ్డి దేనికైనా సన్నద్ధుడు కాలేడేమో!

రాజకీయ నాయకులకు ఆటవిడుపుగా విశ్రాంతి కూడా అవసరం. ఇటువంటి అనివార్య పరిస్థితుల్లో తప్పవారికి ఈ స్వర్ణావకాశం కలుగదు. పైగా ఆయన 19 తేది మొదటగా తాత అయ్యాడు. మనుమరాలితో ముచ్చటగా గడపడానికి కూడా ఒక చిన్న అవకాశం. ఆ తర్వాత మన మొహం కూడా చూడడానికి తీరికలేని పెద్ద పదవి

కొనక 8 పేజీ

# జమీన్ రైతు

## కేంద్రమంత్రివర్గం

ప్రధాని శ్రీ పివి నరసింహారావు కేంద్రమంత్రి వర్గాన్ని పునర్వ్యవస్థీకరించారు. ఎప్పుడో జరగవలసిన మార్పులివి. మాధవ్ సింగ్ సోలంకి, చిదంబరం, రామమూర్తి, విజయభాస్కర రెడ్డి, మాధవరావు సింధియా వంటి వారు తొలి మంత్రి వర్గం నుంచి అప్పుడప్పుడుగా వైదొలగడంతో ఆ శాఖలన్నింటినీ ప్రధానే ధరిస్తూ వచ్చారు. ప్రధాన మంత్రిత్వం నిర్వహణకు ఒక వ్యక్తికి 24 గంటల సమయమే చాలదు. దానితో పాటు ఈ శాఖల బరువునంతటినీ కూడా మోయడం అలివయ్యే పనేనా? మహారాష్ట్ర గవర్నర్ శ్రీ సుబ్రహ్మణ్యం ఆ మాట చెప్పి, వివాదాస్పదుడై పదవి పరిత్యజించారు. ఎంతో ఆలస్యం జరిగినా, విస్తరణను సమగ్రంగానే జరిపి విమర్శకుల నోళ్ళు మూయించారు ప్రధాని శ్రీ పివి. ఈ విస్తరణ ఆయనకు పని భారం తగ్గడంలోనే కాదు – ప్రభుత్వం పై తనకింకా పట్టువుందని నిరూపించుకోవడానికి వుపకరించింది. అయోధ్య పరిణామాల తర్వాత పివి బలహీనుడై పోయాడని, తిరుగుబాట్లు తల ఎత్తనున్నాయని వస్తుండిన ప్రచారానికి విరుగుడుగానూ వుందిది. ఒకే సారి 14 మంది మంత్రులను తొలగించడం ద్వారా పార్టీ పైన ప్రభుత్వం పై తన తిరుగులేని పెత్తనాన్ని రుజువు చేశారు పివి.

అదే సమయంలో పవార్, అర్జున్‌సింగ్‌ల జోలికి పోకుండా జాగ్రత్తపడి రాజకీయ నిపుణుడనన్పించుకున్నారు. తొలగించిన వారిలోనూ సీనియర్లు లేదా పార్టీలో బలం వున్నవారు ఎవరూ లేకపోవడం గమనార్హం. దినేష్ సింగ్, ఏకె ఆంటోని, ప్రణబ్ ముఖర్జీ, ఎన్‌కెపి సాల్వే వంటి అనుభవజ్ఞులను సహచరులుగా తీసుకుని మంత్రివర్గానికి ఇమేజ్ పెంచారు. హోంమంత్రి ఎస్‌బి చవాన్ పని తీరుపై మొదటి నుంచి ప్రధానికి అసంతృప్తి వుంది. కాని ఆయన్ను కదిలించే సాహసం లేదు. ఉభయ తారకంగా రాజేష్ పైలట్‌కు ఆంతరంగిక భద్రత అప్పగించి తెలివైన పనిచేశారు.

ఆంధ్ర ప్రదేశ్‌కు మాత్రం అన్యాయం జరిగింది. ఒకేసారి ఇద్దరు మంత్రులను తొలగించి వేశారు. చింతామోహన్ వంటి విధేయుడ్ని, సమర్థుడ్ని ప్రక్కకు తప్పించ వలసిన అవసరం ఎందుకు ఏర్పడిందో అనూహ్యం. అవినీతి సామ్రాట్‌గా కీర్తి గడించిన రంగయ్య నాయుడుకు మాత్రం స్టేట్ మంత్రిగా ప్రమోషన్ ఇచ్చారు. పేరుకు నలుగురు మంత్రులున్నారనే కాని, ఆంధ్ర నుంచి ఒక్క సీనియర్ కూడా లేకపోవడం లోపమే. విజయభాస్కర రెడ్డి స్థానమైనా ఆంధ్ర నాయకుడితో పూరించి వుండవలసింది!

## బుష్ బరితెగింపు

పదవి పరిత్యజించే చివరి క్షణంలో కూడా తన యుద్ధ కాంక్షను వికృతంగా బయటపెట్టి, ప్రపంచ శాంతికి అమెరికా ఎంత ప్రమాదకారిగా తయారైందో నిరూపించారు జార్జి బుష్. చివరి రోజులలో ఇరాక్‌తో గిల్లికజ్జాలు పెట్టుకొని బాంబుల వర్షం కురిపించడం కేవలం సద్దాం హుసేన్ పై వ్యక్తిగత కక్ష తీర్చుకోవడం తప్ప మరేమీ కాదని అర్థమై పోతుంది. రెండేళ్ల క్రితం ఇరాక్ కువైట్ నుంచి వైదొలగిన తర్వాత కూడా దాని నగరాల పై దాడిచేసి, ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసి, ఆ దేశ ప్రజలను సర్వ నాశనం చేశారు బుష్. ఇరాక్ సేనలు యుద్ధ విరమణ చేసినా, అమెరికా విమానాలు బాంబుల వర్షం కురిపించాయి. ఆ పతనం నుంచి కోలుకోలేని ఇరాక్ ఇప్పుడు అమెరికాతో తిరిగి యుద్ధానికి తలపడే పరిస్థితిలో లేదు. ఇది బుష్‌కు కూడా తెలుసు. అందుకే అకారణంగా, కనీసం ఐక్య రాజ్య సమితి అనుమతి కూడా తీసుకోకుండా యుద్ధం ప్రకటించారు. సరిహద్దులు వదలి, ఏకంగా బాగ్దాద్ నగరంలో, అమాయక పౌరులు నివశించే హోటల్ పై దాడి జరిపారు. ఇది అమెరికా పొగరుబోతు తనానికి, బరితెగింపుకు నిదర్శనం.

అయితే రెండేళ్ల క్రితం యుద్ధంలో అమెరికాను గ్రుడ్డిగా అనుసరించిన ప్రపంచ దేశాలు ఇప్పుడు దానితో విభేదించి చూసవత్వాన్ని చాటుకున్నాయి. మిత్ర రాజ్యమైన ఫ్రాన్స్ మొదట బయటపడి, నిరసన తెల్పింది; ఇటలీ దానికి జత అయింది; అస్తవ్యస్తమైన ఆర్థిక వ్యవస్థతో అమెరికా పెట్టే డాలర్ల భిక్షకోసం పరితపించి పోతున్న రష్యా కూడా సాహసించి వ్యతిరేకత వ్యక్తం చేసింది. ఆనాడు ఇరాక్ పై కత్తి కట్టిన సౌదీ అరేబియా వంటి గల్ఫ్ దేశాలు సైతం అమెరికా పట్ల అసంతృప్తిని ప్రకటించాయి సద్దాం హుస్సేన్ దురహంకారి; కాని అతడ్ని శిక్షించడానికి అమెరికా ఎవరు ?నాయకుల మధ్య వ్యక్తి గత వైరం వుంటే అమాయక ప్రజలను నాశనం చేయడం ఏమి నాగరికత? యుద్ధపాటవం, ధన సంపద, అపార ఆయుధాగారం వుందన్న దురహంకారంతో అమెరికా తనకు గిట్టని చిన్న దేశాలను అణచి పారేయజూస్తే ప్రపంచం ఏమై పోతుంది?

# జమీన్ రైతు

22-1-1943

### రంధ్రాన్వేషి

(పాఠకుడు)

**నెల్లూరు బస్ స్టాండులు:**

నెల్లూరులో రెండు బస్టాండులలో బండ్ల రాకపోకలను గూర్చి మరలా క్రొత్తబోర్డులను వ్రాయించినారు. మంచిదే! కాని యీ టైమింగులు యుద్ధానికి ముందువి-ఇక వాటిలో పాతిక వంతు బండ్లు నడవడంలేదు. అందులో దక్షిణ బస్ స్టాండు బోర్డు ఇంగ్లీషులో వెలగబెట్టివున్నారు-వాటిని చదువగలిగింది ఎవరు? (ప్రయోజనం లేదని గాబోలు) శుభ్రంగా తెలుగులో యిప్పుడు నడిచే బస్సుటైములు వ్రాసిన గదా వుపయోగకారిగా వుండేది? వృధాగా యింత డబ్బు తగుల బెట్టినారయ్యా కమీషనరు గారూ ? ముందే యీ మాత్రపు యోచన చేయలేక పోయినావా?

**తెనుగు సంవత్సరాదికి శలవు లేదు:**

మదరాసు తెలుగు రాజధిన్నిన రాష్ట్రం మదరాసు నగరంలో 7 3/4లక్షల జనాభాలో మెజారిటీ తెలుగు వారిది. మొత్తం జనాభాలో అరవల కంటే ఆంధ్రులు సుమారు 75లక్ష లధికము. (హిందూదేశం మొత్తంలో తెలుగు నాల్గవది) అదిగాక నేడు ప్రభుత్వప్రధాన కార్యదర్శి తెలుగు కొంత రామమూర్తిగారు -అన్నివున్నవి-ప్రయోజనం ఏమి? ప్రాబల్యం లేదు.

కాబట్టి యీ యేరు అరవ సంవత్సరాదిని శలవుగా ప్రకటించిందిగాని తెలుగు వుగాదిని శలవుగా ప్రభుత్వం నిర్ణయించలేదు. విషయం స్పష్టం కావచ్చునుగాని,

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

యోచిస్తే ఫలితం చాలా గొప్పదిగా స్ఫురిస్తుంది. అంటే ప్రభుత్వంలో ఆంధ్రులు క్రిందైపోయి వారి ప్రాబల్యమే అంతరించగలదేమో అనిపిస్తున్నది. పెద్దలు దీనికి ఆదిలోనే విరుగుడు వేస్తే బాగుంటుందనుకుంటా.

### నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

**జూబిలి ఆసుపత్రి**

మాతృ్యాస్పతి చేతిపైన మరొక డాక్టరుండాలి. మున్సిపాల్టీ కోరితే ఈ మాచేతిక్రింద కొక డాక్టర్ను ప్రభుత్వం ప్రసాదించింది. ఊపిరితిత్తులకు వేయమన్న పట్టును కడుపుమీద వేసేంతటి తెలివిగల నర్సులుండే ఈ యాసుపత్రిలో మరొక డాక్టరు మాత్రం అవసరమే. పని యెక్కువైనప్పుడు అంతా నకచేతి మీదనే జరగాలంటే సాధ్యమా?

**బ్యాంకి ఎలక్షన్**

17తేది ఎలక్షన్ జరిగింది. అనుకున్నట్లే దశయ్య ప్రెసిడెంటు . ముంగమూరు నరిసింహారావు ఉప ప్రెసిడెంటు. ఎ.సి.రెడ్డి -బేవిరెడ్డి రాజా రాంరెడ్డి -బద్దెపూడి చంగారెడ్డి-పాశెపు దశరథరామిరెడ్డి- మొగళ్లూరు శివయ్యగారలు కార్యనిర్వాహక

కాలవ 10 పేజీలో

# అమెరికన్ వాణిజ్య భూతం నుంచి రైతులను రక్షించాలి!

వాణిజ్యం పేరుతో అమెరికన్ భూతం ఒకటి భారతీయ రైతులను కబళించను వస్తున్నది. ఆ భూతమే 'డంకెల్ డ్రాఫ్ట్ టెక్స్టట్' ఒప్పందం. ఆర్థిక సహాయం కోసం మన కేంద్ర ప్రభుత్వం ఈ ఒప్పందం చేసుకోవడమంటే దేశంలోని భూములన్నీ తాకట్టు పెట్టడమే అవుతుంది. ఇప్పటికే పలు యూరోపియన్ దేశాలు ఈ ఒప్పందం పై సంతకాలు పెట్టి వున్నాయి. ఆ ఒప్పందం అమలైతే అమెరికా ప్రతిపాదించిన విత్తనాలు, పురుగు మందులు మాత్రమే వాడాలి. ఏ జిల్లాలో ఎటువంటి పంట పండించాలో వారు నిర్దేశిస్తే దానికి అనుగుణంగా భారతీయ రైతులు నడవాలి. ఈ ఒప్పందం కుదిరితే ప్రతిపాదించిన పంటకు పెట్టుబడి పెట్టలేక రైతు కూలీగా మారడం ఖాయం. దీనివల్ల ఏర్పడే అనర్థాలకు హద్దు పద్దు లేకుండా పోతుంది. ఈ విపత్తును ఆర్థిక సంస్కరణల పేరుతో ప్రభుత్వం పక్క త్రోవ పట్టించను ప్రయత్నిస్తూంది. దీని పై మన నాయకులెవరూ స్పందించక పోయినా ఉత్తరప్రదేశ్‌కు చెందిన జన్యు శాస్త్రవేత్త డాక్టర్ సుమన్ సహాయ్ విదేశంలో బంగారం వంటి వుద్యోగం వదలిపెట్టి స్వదేశం వచ్చి చేస్తున్న స్వచ్ఛంద ప్రచారానికి దేశంలోని రైతులు మద్దతివ్వాలి. డంకెల్ డ్రాఫ్ట్ ఒప్పందాన్ని త్రిప్పికొట్టమ ప్రభుత్వం పై వత్తిడి తేవాలి.

– నిరంజన్




**చెర్లోపాళెం సింహస్వప్నం**

జనవరి 8 వ తేదీ 'జమీన్‌రైతు' సంచికలో 'కాన్పు కోసం వెళితే కాటికి పంపుతున్నారు' అని జూబిలి ఆసుపత్రి పై రాసిన వ్యాసం చదివి ఆవేదనతో మనసు ర...పోయింది. డాక్టర్ రోగికి కనపడే ప్రత్యక్ష దైవమనే మాట ఈ ఆసుపత్రికి వర్తించదు. అయినా ఇటీవల ప్రభుత్వ ఆసుపత్రుల్లో వైద్యం దిగజారిపోతూంది. తాము తీసుకొంటున్న జీతం కంటే బంగారు బాతు గుడ్డు వంటి ప్రైవేట్ ప్రాక్టీస్ పై మక్కువ ఎక్కువై పోతుంది. ఏళ్ల తరబడి బదలీలు లేక పోవడమంటే వైద్య, ఆరోగ్య శాఖ వున్నతాధికార్ల నందరినీ తప్పక తప్పు పట్టాల్సిందే . చనిపోవడం సహజమే; నిర్లక్ష్యానికి ఎవరు మూల్యం చెల్లిస్తారు? ఆ కుటుంబాన్ని ఎవరు ఓదారుస్తారు? నెల్లూరు ప్రభుత్వ ఆసుపత్రుల్లో దిగజారి పోయిన వైద్య విలువలను పునరుద్ధింప జేయడం కోసం స్వయాన వైద్య ఆరోగ్య శాఖ నిర్వహిస్తున్న ముఖ్యమంత్రి తగిన చొరవ చూపాలి. ఏది ఏమైనా ప్రభుత్వ శాఖల్లో అవినీతిని ఎండ గడుతూ సింహ స్వప్నంగా నిలిచిన 'జమీన్‌రైతు'ను ప్రశంసించడం బాధ్యతగా భావిస్తున్నాను.

కోవూరు. -జె. శ్రీనివాసులు రెడ్డి

**వీధి దీపాలు వెయ్యండి**

ఒక సంవత్సరం ,నవాబుపేట చివర నుంచి నరుకూరు మెయిన్

కాలవ 8 పేజీలో

కొనసరులోనే ఇంత లాభముంటే అసలు కాలేజిలో ఇంకెంత దిగ్రమింగుడు వుండి వుండాలి ?

# లా కాలేజి స్వాహాలు లక్షల్లో వున్నాయి!

విఆర్ లా కాలేజి భవనాలు అనిత్యంగా, అధ్వాన్నంగా కడుతున్నారని వ్రాస్తే, కాలేజి శాశ్వతాధ్యక్షుడు అనం భక్తవత్సల రెడ్డి గారికి కోపం పొడుచుకొని వచ్చింది; పులిలాగా గాండ్రించారు. ఆయన బుకాయింపు చూసిన వారెవరికైనా సత్య హరిశ్చంద్రుడికి పినతల్లైన వారసుడైన ఒక అమాయక శిఖామణిపైన అన్యాయంగా ఆరోపణల బురద చల్లారేమోనని జాలి కలగడం ఖాయం. అంత గొప్పగా నిజాయితీని నటించడం ఆయన ఒక్కరికే సాధ్యం. జిల్లాలోని ఇతర రాజకీయ నాయకులవలె కాంట్రాక్టుల్లో పర్సెంటేజిలు, బదలీల్లో ముడుపులు దండుకునే నైచ్యం, చతురత భక్తవత్సల రెడ్డిగారిలో లేని మాట నిజమే. ఆ

**లెక్చరర్ల దిన కూలి ఇరవై రూపాయలు**

కోణం నుంచి చూస్తే మాత్రం వారిది నిజాయితీపరత్వం కల్గిన కుటుంబం. కాని విఆర్ కాలేజి వ్యవహారాలలో

**లెక్క అడిగిన పాపానికి పరీక్ష పేపర్లో సున్నాలు చుట్టారు**

మాత్రం వారి చేతులు స్వచ్ఛంగా లేవు. ఆ మూల సోధంలో, అంతఃపురాంతర్భాగంలో, చిత్రగుప్తుడి

**ప్రిన్సిపల్ చేత కూడా పాపాలు చేయిస్తున్నారు!**

సోదరుడి కంటె మిన్నయైన గుమాస్తా పంతులు గారి కవిలె కట్టలను బయట పెట్టి గడిస్తే, పత్రాలను చూడగలిగితే విఆర్ కాలేజిలో గుటకాయ స్వాహా అవుతున్న నిధుల మొత్తం ఊహాకు

**బిసి విద్యార్థుల రీ ఇంబర్సమెంట్ ఆరేడు లక్షలు అదృశ్యం**

మించే వుంటుందనిపిస్తుంది. ఇంట్లో కామధేనువును వుంచుకుని, రోడ్డుపోయే ఆవుల పాదుగు పిండవలసిన అవసరం ఏముంది చెప్పండి?

వాటర్ గేట్ కుంభకోణాన్ని వెలికి తీసిన పాత్రికేయులకైనా విఆర్ కాలేజి లోగుట్టు కనిపెట్టడం తరమౌ తుందనుకోలేము. అంత కట్టుదిట్టంగా వుందక్కడి కుంభకోణాల భాగోతం. ఎంత నిధులు వస్తున్నాయో తెలియదు; ఎంత ఖర్చుపెడుతున్నారో తెలియదు; ఎంత భోంచేస్తున్నారో తెలియదు; ఎవరెవరు వాటాలు పంచుకుంటున్నారో అసలే తెలియదు; అంతా చిదంబర రహస్యం. నిధులు వస్తుంటాయి, పోతుంటాయి- కాని కాలేజి మాత్రం ఆ శిథిలావస్థ నుంచి బయటపడదు. అవే పాడుపడిన దృశ్యాలు, అవే పాచిపట్టిన గోడలు, అవే విరిగిన బెంచీలు, అవే గలీజు క్లాసు గదులు, అవే అధ్వాన్నపు లేబరేటరీలు; ఎన్నేళ్లు గడిచినా కాలేజి వాతావరణంలో మార్పే వుండదు. ఒక్క ఆట పరికరం కొనరు; ఒక్క అదనపు కోర్సు ప్రారంభించరు; ఒక్క కొత్త ప్రయోగం చేయరు; ఒక్క కొత్త నియామకం జరపరు; వారిని అడిగే

**సణుగుడు**

డోలేంద్ర



వారు లేరు. అడిగించుకునేవారూ లేరు. అధ్యక్షుడి మొదలుకొని కార్యదర్శివరకు అందరూ శ్రీవైష్ణవులే; కాని బుట్టలోని చేపలు ఎప్పటి కప్పుడు మాయమౌతుంటాయి. అది వైష్ణవ మాయ అని సరిపెట్టుకోవలసిందే!

విఆర్ కాలేజి లోగుట్టు కనిపెట్టడం ఎవరితరమూ కాదు కాబట్టి, దాని పిల్ల కాలేజిగా పిలవబడే లా కళాశాల కథా కమామీషు చూద్దామని లోపలకు తొంగిచూద్దును గదా- గుప్పుమన్న అవినీతి కుళ్లు కంపుతో ముక్కులు పగిలిపోయాయి. ఏ మునిసిపాలిటీ చెత్త తొట్టినో వాసన చూసిన ఫీలింగ్ కల్గింది. లా కాలేజిని ఒక లాభసాటి వ్యాపారంగా మలచుకుని వుంది యాజమాన్యం. కళాశాల నిర్వహణలోని ప్రతి అణువులోనూ కోపెడియే.

భవనాల సంగతే చూడండి;

**రికార్డుల్లో నాలుగు సెక్షన్లు, నడిచేది మాత్రం ఒక్కటంటే ఒక్కటే**

వీటికోసం ఎంత నిధి ఏ రూపంలో వచ్చిందో ఎవరూ చెప్పడం లేదు. అంతా రహస్యం. కట్టించే రామసుబ్రహ్మణ్యం గారికి తప్ప కమిటీ అధ్యక్ష కార్యదర్శులకైనా ఆ సంగతి తెలుసో లేదో తెలియడం లేదు. ప్రాథమిక పాఠశాల భవనం కంటే హీనంగా కడుతున్నారు దాన్ని. ప్రక్కనున్న ఫోటో చూడండి- కిటికీలకు వాడిన కమ్ములు గమనించండి- శ్లాబ్‌పోయగా మిగిలిన ముక్కలు తెచ్చి బిగించేశారు. అదొక్కటి చాలు ఆ భవనం నాణ్యత తెలుసుకోవడానికి. ఇందులో ఎన్ని లక్షలు గుటకాయ స్వాహా అవుతున్నదో ఆ పరమాత్ముడికే ఎరుక.

ఫీజుల రూపంలో పిండే సొమ్ము సైతం తక్కువ లేదు. ప్రతి విద్యార్థి దగ్గరా స్పెషల్ ఫీజు రూపంలో 800 దండుతున్నారు. రమారమి 1500 మంది విద్యార్థు లుంటారనుకుంటె ఏడాదికి 12 లక్షలు వస్తుంది. ఇంత డబ్బు దండినప్పుడు కాలేజిలో కనీస పాటి విద్యా సౌకర్యాలు కల్పిస్తే ఫర్వాలేదు. కాని ఇరవయ్యేళ్ల వయసున్న కాలేజిలో లెక్చరర్ల సంఖ్య కేవలం ఆరు. ఆరుగురితో 3 ఏళ్లకోర్సు, 5 ఏళ్ల కోర్సులతో పాటు, ఇప్పుడు కొత్తగా ఈవెనింగ్ సెషన్ కూడా పెట్టి

**ఏడాదికి రెండు లక్షల లైబ్రరీ డిపాజిట్ వడ్డీకి మారుతూంది**

లాగించేస్తున్నారు. నాన్ టీచింగ్ స్టాఫ్ సంఖ్య కూడా నాలుగే! పార్ట్‌టైం లెక్చరర్ల పేరుతో పదిమంది

**ఆటల ఫీజు జేబులో దాక్కుంది; యూనివర్సిటీ రావద్దన్నది !**

''న్యాయకోవిదుల'' చేత వెట్టి చాకిరీ చేయిస్తున్నారు. వారికిచ్చేది గంటకు ఇరవై రూపాయలట. వారానికి

**కార్పస్ ఫండ్ ఎవరిపై కనక వర్షం కురిపిస్తున్నదో!**

ఐదారుగంటలు మించి పని ఇవ్వరు. రిక్షా కార్మికుడి కంటె, బేల్దారి కూలి

కొంద 12 పేజీలో



అతుకుల బొంతలాగా, అధ్వాన్నంగా నిర్మితమౌతున్న లా కాలేజి భవనాలు;



శ్లాబ్‌లో మిగిలిన కమ్ములతో, పాత చెక్కతో అమర్చిన కిటికీల సుందర ముదనష్ట దృశ్యం

ఇంతింత పెంచడానికి ఎవరు అధికారమిచ్చారు?

# ప్రైవేటు టౌన్ బస్ ఛార్జీలు— ప్రయాణీకుల నిలువు దోపిడీ!

టౌన్‌లో నడిచే ప్రైవేట్, ఆర్టీసీ బస్సుల ఛార్జీలు మళ్ళీ పెరిగి పోయాయి. ఈ పెంపుదలకు ఒక పద్ధతి, క్రమమంటూ లేకుండా వుంది. ఆర్టీసీ ఛార్జీల పెంపుదలకే ప్రజలు అల్లాడి పోతుంటే ప్రైవేట్ బస్సుల వారికి కూడా ఛార్జీలు పెంచుకోమని అధికారులు ఇచ్చిన వుత్తర్వును చూసి నవ్వాలో, ఏడ్వాలో అర్థం కావడం లేదు. పల్లెటూరి టూరింగ్ టాకీసుల్లో పండుగ సమయాల్లో జనాన్ని కూరినట్లు, ఆడవాళ్లు, మగవాళ్లు అనే భేదం లేకుండా బస్సులను కిక్కిరిసేలా చేసి, కలెక్షన్ కోసమంటూ స్టాపింగుల్లో గూడ్సు బండుల్లా నిలిపి, సహనం చచ్చిన జనం బండబూతుల దీవెనలతో నడిచే ఈ టౌన్‌బస్సుల ఛార్జీలకన్నా ప్రస్తుతం ఆటో ఛార్జీలే నయమనిపిస్తున్నాయి. రౌతులేని గుర్రాల్లా రెచ్చిపోయి నిత్యం ఎవరో ఒకర్ని బలితీసుకొనే ఈ బస్సు

**సింహపురి**

ఛార్జీల చార్టులు సైతం విశృంఖలంగా వున్నాయి. 6 కిలోమీటర్ల లోపున వుండే స్టాపింగులకు కేవలం 15 పైసలు మాత్రమే పెంచినట్లు రవాణాధికారి పత్రికా ప్రకటనలో చెప్పడమే తప్ప, బస్సు ఎక్కితే భారీ వడ్డింపులే కనపడతాయి. టౌన్‌లోని ఆత్మకూరు బస్టాండ్ నుండి ఏడు కిలోమీటర్ల దూరాన వుండే అయ్యప్ప గుడి వద్దకు ప్రైవేట్ బస్సులు 2-25, ఆర్టీసీ 2-50 ఏ ప్రాతిపదికమీద వసూలు చేస్తున్నారో ఎవరికీ తెలియదు. ప్రైవేట్ బస్సుల వారు స్టాపింగులని పిలిస్తే, ఆర్టీసీ వారు స్టేజీలంటారు; రవాణా శాఖాధికారి మూడు స్టేజీలకు మించి ఛార్జీలే పెంచలేదంటారు. ఈ గందరగోళ విషయాన్ని ఎవరు సరిదిద్దుతారో అర్థం కావడం లేదు. ఇదివరకు టౌన్‌లోని ఆత్మకూరు బస్టాండ్ నుండి వి.ఆర్.సి. వరకు 60 పైసలు, ఆర్టీసీకి 85 పైసలు; పోలీస్

కొంద 12 పేజీలో

## జిల్లా వార్తలు

# కావలి మునిసిపాలిటీ తలరాత మారదా?

కావలి మునిసిపాలిటీలో గత మూడు సంవత్సరాలుగా ఇన్‌ఛార్జ్ కమీషనర్ల పాలన కొనసాగుతూంది. కౌన్సిల్ రద్దయిన తొమ్మిది మాసాల్లో ఐదు మంది కమీషనర్లు మారి రికార్డు సృష్టించారని చెప్పవచ్చు. బహుశా ఇక ఆఫీసులో ఇన్‌ఛార్జ్ అర్హత కలవారెవరూ మిగిలి లేరేమో అనిపిస్తుంది. కౌన్సిల్ నడిచే రోజుల్లో గాని, ఇన్‌ఛార్జ్‌ల పాలనలో గాని టౌన్‌లో ఇసుమంతైయినా అభివృద్ధి కానరాక పోవడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. వెలగని వీధి లైట్లు, ఎక్కడ చూచినా పేరుకు పోయిన చెత్తా, చెదారం, గుంటలు పడ్డ రోడ్లకు తోడుగా దోమల బాధ టౌన్ ప్రజల సహనాన్ని పరీక్షిస్తున్నాయి. ఏ సమస్య మీదైన ప్రజలు ఆఫీసు కెళితే విషయాన్ని ఆలకించే వారే లేరు. సిబ్బంది తన కనుసన్నలలో నడిచే విధంగా తెరవెనుక నుంచి మాజీ మునిసిపల్ ఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టి శాసిస్తున్నారట. బిగ్ బాస్ ఎమ్మెల్యే యానాదిరెడ్డి గారి ప్రథమ శిష్య పరమాణువు కావడంతో సిబ్బంది కూడా యానాది శెట్టి గారు ఏ హుకుం జారీ చేసినా 'జీ హుజూర్' అంటూ అమలు చేసేస్తున్నారు. 20 రోజుల క్రితం [illegible] నుంచి వచ్చి కమీషనర్‌గా బాధ్యతలు [illegible] లక్ష్మీ నారాయణ నిష్పక్షపాతంగా వ్యవహరిస్తూ, పని చేస్తుంటే సరికి ఈ రెండో ఎమ్మెల్యేగారికి చిర్రెత్తి పోయి, రాబోయే ఎలక్షన్ సాకును గురువు గారికి చూపి వచ్చిన మూడో వారంలోనే తిరిగి యథాస్థానానికి పంపించి వేసి తన గొప్పతనాన్ని చాటుకున్నారు. తిరిగి ఇంతకు ముందు ఇన్‌ఛార్జి కమీషనరుగా వుండిన వాగేశ్వర రావునే నియమించు కొన్నారు. ఆయన తన ఇష్టమొచ్చిన వారికి తప్ప ఇతరులకు ఏ పని చేయక పోవడం ధ్యేయంగా పెట్టుకొని వున్నాడని కావలిలో కోడై కూస్తున్నా; టౌన్ అభివృద్ధిని గూర్చి పట్టించుకునే వారే కరువవ్వడంతో కావలి మునిసిపాలిటీ తలరాత ఇంతేనేమో అనిపిస్తుంది.

### కావలి నాటకానికి కడపలో బహుమతి

భారతీయస్టేట్‌బ్యాంకు ఉద్యోగ జోన్ పరిధిలో భాగంగా కడపలో జనవరి 8,9,10 తేదుల్లో జోనల్ కల్చరల్‌మీట్ జరిగింది. ఇందులో కావలి బ్యాంకు శాఖ ప్రదర్శించిన పారాహుషార్ ఉత్తమ ద్వితీయ ప్రదర్శనగా ఎంపికయ్యింది. బ్యాంక్‌లోనే పనిచేసె కె. శ్రీనివాస ప్రసాద్ వక్తృత్వపోటీల్లో ద్వితీయ స్థానంలో నిలచి 10 తేది జరిగిన బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమంలో కడప కలెక్టర్ శ్రీ సుబ్రహ్మణ్యం చేతులమీదుగా బహుమతి అందుకున్నారు. పారా హుషార్ నాటక కర్త జలదంకి సుధాకర్ కావలి వాసి కావడం విశేషంకాగా, దాని తొలిప్రదర్శనలోనే కావలి బ్యాంకుకు బహుమతి లభించడం ఇంకా పెద్ద విశేషం.

### డి.పి.ఆర్.ఒ.కు అభినందన

జిల్లా పౌరసంబంధ శాఖాధికారిగా పనిచేస్తూ అసిస్టెంట్ డైరెక్టరుగా పదోన్నతి పొందిన శ్రీ [illegible]

కొరవ 8 పేజీలో

## అల్లూరులో వాలీబాల్ పోటీలు

అల్లూరులో 5 జిల్లాల స్థాయి వాలీబాల్ పోటీలు 20 తేది ముగిసాయి. 18 తేది పోటీలను సర్పంచ్ శ్రీ మేకా అశోక్ కుమార్ రెడ్డి ప్రారంభించారు. చిత్తూరు, కడప, నెల్లూరు, ప్రకాశం, గుంటూరు జిల్లాల నుండి వచ్చిన 15 జట్లు పోటీల్లో పాల్గొన్నాయి. ఆటగాళ్లు అత్యంత పోరాట పటిమ చూపిన ఈ పోటీల్లో చిత్తూరు జిల్లా బంగారుపాళెం జట్టు ప్రథమ స్థానం పొందింది. రేణిగుంట, చీరాల, అల్లూరు, సూళ్లూరుపేట జట్లు తరువాతి స్థానాలు పొందాయి. ఆటగాళ్లలో ప్రతిభ చూపిన కుమార్ రాజ ఆఫెన్స్, శ్రీనివాసులు రెడ్డి బూస్టర్ శ్రీధర్ ఆల్ రౌండర్‌గా ప్రత్యేక బహుమతులు సాధించారు. విజేతలకు జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర, ఎమ్మెల్యే శ్రీ కె. విష్ణువర్ధన రెడ్డి 20 తేది సాయంత్రం జరిగిన ఒక ప్రత్యేక కార్యక్రమంలో బహుమతులందజేసారు. అల్లూరు యూత్ వాలీబాల్ అసోసియేషన్ నిర్వాహకులు హుమయున్, విక్టర్, శ్యామ సుందర రెడ్డి పోటీ ఏర్పాట్లు పర్యవేక్షించారు. హుమయున్ జాతీయ స్థాయి వాలీబాల్ క్రీడాకారుడు.

# గూడూరు మార్కెట్లో తూకాల్లో మోసాలు

గూడూరు టౌన్ వ్యాపారస్థులు తూనికల్లో మోసం చేస్తూ సామాన్య ప్రజానీకాన్ని పట్టపగలు దోచేస్తున్నారు. తూనికలు, కొలతల శాఖ అధికారులు పట్టణంలో వుండి కూడా ఈ దారుణాన్ని ఆపలేక అవినీతిని ప్రోత్సహించడం దారుణంగా వుంది. ఇక్కడి కూరగాయలు మార్కెట్‌లో 15 యేసి కిరాణా దుఖాణాలు కూరగాయల అంగళ్లు వున్నాయి. పట్టణ పల్లె ప్రజానీకమంతా ఇక్కడి నుండి కూరగాయలు కొనుగోలు చేస్తుంటారు. అయితే నిత్యం వేల రూపాయల్లో వ్యాపారం సాగే ఈ కూరగాయల మార్కెట్‌లో తూచే ప్రతి కేజి వస్తువుకు పావుకేజి తక్కువ తూకం వస్తుంది. ఇదేమని ప్రశ్నిస్తే సమాధానం చెప్పకపోవడమే కాదు తిరిగి దబాయిస్తారు. పరిస్థితి ఎంత అన్యాయంగా తయారైనా తూనికలు కొలతలు శాఖాధికారుల దాడులు నామ మాత్రమే. ప్రతి రాయికీ సీరు ప్రభుత్వ సీలు వేయాల్సి వుండగా అవి ప్రధాన అంగళ్లలో పరిమితమై వుండడంతో ఈ చిల్లర వ్యాపారస్తులు అసలు భయపడటం లేదు. అదేమని ప్రశ్నిస్తే నీవు ఇష్టమైతే కొను లేదంటే లేదు, మమ్మల్ని మీరెవరు ప్రశ్నించేది? మేము పోలీసులు మొదలు కొని, మున్సిపాల్టీ వాళ్ళ వరకు మామూళ్లు చెల్లిస్తున్నామని, ఇలా తూకం ఇస్తున్నట్లు తమకు కూలి పాటు కూడా మిగలడం లేదని అంటుంటారు. తూనికలు కొలతల శాఖ అధికారులు నిద్రమత్తు వదిలించుకొని నిత్యం జరుగుతున్న ఈ దోపిడీలను అంతమొందించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

### చెన్నూరు మిత్రమండలి

గూడూరు మండలం చెన్నూరు గ్రామంలోని స్వచ్ఛంద సేవా సంస్థ మిత్రమండలి సర్వసభ్య సమావేశం 10 తేది సంస్థ గౌరవ సభ్యులు డాక్టర్. శివయ్య అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా జరిగిన నూతన కార్యవర్గ ఎన్నికల్లో గౌరవాధ్యక్షుడిగా శ్రీ ఎన్.వి. కృష్ణయ్య, అధ్యక్షునిగా ముంగర రామయ్య, వుపాధ్యక్షుడుగా ఎన్. రామరెడ్డి, కోశాధికారిగా పి. వెంకట కృష్ణయ్య మరో 9 మంది కార్యవర్గ సభ్యులు ఎన్నికయ్యారు.

# మేనకూరు యువకులు ఎందుకింత దుడుకుగా వ్యవహరిస్తున్నారు?

> మనవాలి
> గౌడ కులస్తులపై
> మేనకూరు రైతుల
> దౌర్జన్యం!

నాయుడుపేట మండలం మేనకూరులో, పొరుగున వున్న మనవాలి గ్రామస్తులకు చెందిన గౌడకులస్తులపై దాడి చేసి, ఆరు గుడిసెలు, రెండు గడ్డివాములు, ఒక టైరు బండి తగుల బెట్టారు; వడ్లమూటలు దోచుకున్నారు. ఇది కేవలం రైతులు పొగరు బోతుతనంతో చేసిన దుర్మార్గమే. మనవాలికి చెందిన గౌడ కుటుంబీకులు మేనకూరులో ఒక చర్చికి చెందిన ఆరెకరాల మాగాణి భూమిని సాగు చేస్తున్నారట. దానికి తోడు వారి స్వంత భూములూ వున్నాయి. వారికి, ఆ గ్రామంలోని కొందరు రైతులకు ఏదో విషయమై వివాదం వచ్చింది. ఆ సాకు చూపి, వారిని పొలం వదలి పొమ్మన్నారట. వ్యక్తిగతమైన వివాదాలకు, వ్యవసాయానికి ఏమి సంబంధం? అందులోనూ వారు భూమికి మక్తా ముందే కట్టివున్నారట. భూమిని నమ్ముకున్నవాడు దాన్ని వున్న పళంగా వదలగలడా? వారు చుట్టు ప్రక్క గ్రామాల పెద్దలకు ఈ విషయం చెప్పి సహాయం అభ్యర్థించారట. మేనకూరు మగధీరులకు ఇది కోపం తెప్పించింది. తమ మాట విని పొలం ఖాళీ చేయక పోవడమే కాక, తమపై ఇతరులకు ఫిర్యాదు చేశారనే కక్షతో వారి పొలాలకు వెళ్లి, గుడిసెలు తగులబెట్టి, టైరు బండి ధ్వంసం చేసి, గడ్డివాములకు నిప్పంటించి నానా బీభత్సం సృష్టించారు. మోటార్లు కూడా ధ్వంసం చేశారట. పాపమా పేద గౌడ కులస్తులు లబోదిబో మంటున్నారు.

అసలు గ్రామంలో వ్యవసాయం చేయవద్దని ఆంక్ష విధించడానికి వీరెవరు? మేనకూరు గ్రామం ఎవరబ్బసొత్తు? నియంతల్లాగా పెత్తనం చలాయించడానికి ఇదేమన్నా సత్రకాలమా? మాట వినకుంటే ఇళ్లు, ఆస్తులు ధ్వంసం చేయడానికి సిద్ధపడడమేమిటి? దీనిపై పోలీసు కూడా తగిన చర్య తీసుకున్నట్లు లేదు.

మేనకూరు యువకులు ఇటీవల తరచు ఇటువంటి దుడుకు పనులకు పాల్పడుతున్నారు. ప్రక్కనే వున్న భీమవరం గ్రామంలో ఒకసారి అరాచకం సృష్టించారు. అక్కడి హరిజనులు ఇతర ప్రాంతాలలో వలె మిలిటెంట్లు కాదు కాబట్టి సరిపోయింది కాని, లేకుంటే అదొక కారంచేడు వలె తగలబడి వుండేది. తమను ఆదరించే రాజకీయవాదుల అండను దుర్వినియోగం

కొరవ 8 పేజీలో

### ఆరోపణలు రుజువు చేస్తే రాజీనామా!

నాయుడు పేట సప్తగిరి ఆయిల్ మిల్స్‌లో జరిగిన ఆయిల్ సీడ్స్ కుంభకోణంతో తనకు సంబంధ ముందంటూ నల్లపరెడ్డి శీనయ్య చేస్తున్న ఆరోపణలు రుజువు చేస్తే తన మంత్రిపదవికి రాజీనామా చేస్తానని రాష్ట్ర సమాచార శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య చెప్పారు. 11 తేది [illegible]

కొరవ 8 పేజీలో

సినిమా  సినిమా  సినిమా  సినిమా  సినిమా

## మమ్ముట్టి చేత గంతు లేయిస్తున్న కోడి రామకృష్ణ

హుందాగా పాత్ర పోషణ చేసే మలయాళ నటుడు మమ్ముట్టి హీరోయిన్‌ను హత్తుకోవటం వంటి సన్నివేశాలతో పాటు పాటలకు గంతులేసే సీన్లలో నటించడానికి దూరంగా వుండేవారు. కాని దర్శకుడు కోడి రామకృష్ణ ఆయన చేత ఏకంగా 'మాస్ డ్యాన్స్' వేయించడానికి రంగం సిద్ధం చేసినట్లు తెలుస్తోంది. యువ హీరోయిన్లు మీనా – రోజా వెరైటీ పాత్రలు పోషిస్తున్న కుసుమాంజలి ఆర్ట్ క్రియేషన్స్ చిత్రంలో విప్లవ శంఖం వంటి చిత్రానికి దర్శకత్వం వహించిన టిరం మస్తాన్‌రావు విలన్‌గా నటిస్తున్నారట. మొత్తానికి మలయాళ సూపర్ స్టార్ తెలుగు చిత్రంలో గంతు లేస్తారో లేదో వేచి చూడాలి.

### ప్రబోధాత్మక చిత్రాలు ప్రజలకు నచ్చవా

కుటుంబ సమేతంగా చూడ తగ్గ చిత్రాలను తెలుగు, తమిళంలో నిర్మించే దర్శకుడు విసు. అతను తీసిన 'సంసారం ఒక చదరంగం' ఆదరణ ఆధారం. శ్రీమతి ఒక బహుమతి, ఇల్లు–పిల్లలు– ప్రియురాలు వంటి చిత్రాలు మన పరిశ్రమకు సుపరిచితమే. ఆయన దర్శకత్వంలో తమిళనాడు ప్రభుత్వం సారా వ్యతిరేక వుద్యమంలో భాగంగా తీసిన 'నింగా నల్ల ఇరుక్కనమ్' (మీరు బాగుండాలి) చిత్రం విజయవంతం కాలేక పోయింది. స్వాక్షాత్తు తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత ఒక పాత్రలో కన్పించినా ప్రయోజనం లేకుండా పోయింది. చిత్ర విజయం పై దర్శకుడు విసు వ్యాఖ్యానిస్తూ ప్రబోధాత్మక చిత్రాలు ప్రజలను ఆకర్షించ లేవేమో ననిపిస్తుందన్నారు. తెలుగు నాట తీవ్రంగా వున్న సారా వ్యతిరేక వుద్యమం ఇతివృత్తాన్ని జేర్చి ఇప్పటికే పలు తెలుగు చిత్రాలు రిలీజ్ అవడానికి సిద్ధంగా వున్నాయి. తెలుగు ఆడపడచులు వాటిని ఆదరిస్తారో, చీదరిస్తారో చూడాలి మరి!

### విజయ వారి చిత్రం

"బృందావనం" అనంతరం నెల్లూరీయుడు సింగీతం శ్రీనివాస రావు దర్శకత్వంలో విజయా చందమామ కంబైన్స్ వారు నిర్మించే "భైరవ ద్వీపం" జానపద చిత్రంలో బాలకృష్ణ హీరో.

## రూటు మార్చి సెక్స్‌సీన్లకు సై అంటున్న జూహీ

మిస్ ఇండియాగా ఎన్నికై తరువాత అన్ని భాషా చిత్రాల్లో నటించడం మొదలెట్టిన జూహిచావ్లా ప్రతిభావంతమైన పాత్రలు పోషించి మంచి నటిగా పేరు తెచ్చుకుంది. 'విక్కీదాదా, శాంతి – క్రాంతి' చిత్రంలో నాగార్జునతో జోడిగా కూడా నటించింది. కన్నడంలో ఆమె నటించిన ప్రేమలోకం, సంచలన విజయం సాధించింది. ఇటీవల హిందీ చిత్రాల పై దృష్టి కేంద్రీకరించిన మంచి నటి జూహిచావ్లా, అక్కడి హీరోయిన్ల పోటీని తట్టుకోను ఎటువంటి పాత్రలోనైనా నటిస్తానని ప్రకటించి సంచలనం సృష్టించింది. 'ఇది వరకటి అమాయకురాలు, ముగ్ధ లాంటి ఇమేజ్ నాకు వద్దు' ప్రేక్షకుల్ని కవ్వించడం కూడా ఓ కళే. సెక్స్ సింబల్‌గా నన్ను నేను నిరూపించుకోవాలి. ఇక సాదా సీదా హీరోయిన్ పాత్రలు ధరించనని ప్రకటించింది. ఈ ప్రకటన అనంతరం సుప్రసిద్ధ హిందీ దర్శక. నిర్మాత యాష్ చోప్రా ఈమెతో హీరోయిన్ ఓరియెంటెడ్ చిత్రానికి సన్నాహాలు ప్రారంభించారు. చిత్రం కోసం 'బోల్డ్ గా డ్రస్' వేసుకొని ఇచ్చిన స్టిల్ హిందీ పరిశ్రమలో ప్రస్తుతం తెగ చర్చనీయాంశమై వుంది.

### దేవీ వరప్రసాద్ ఆవేదన

సినిమా పరిశ్రమలో అగ్ర నిర్మాతగా పేరున్న 'ఘరానా మొగుడు' వంటి చిత్రాన్ని నిర్మించిన దేవీ వరప్రసాద్ మళ్లీ చిత్రాలను తీయను భయపడి పోతున్నారు. ప్రస్తుతం తెలుగు సినీ పరిశ్రమ వున్న పరిస్థితుల్లో సినిమా తీయమంటారా? తీస్తే సేవ్ అవుతామంటారా? నిర్మాణ వ్యయం కొండెక్కి, కూర్చున్న ఈ రోజుల్లో ధైర్యంగా సినిమా తీయగలమనే నమ్మకం రోజు రోజుకీ సన్నగిల్లి పోతుందన్నారు ఈ మాటలు ప్రస్తుతం సంక్షోభంలో వున్న పరిశ్రమకు అక్షర సత్యమై నిలుస్తాయి.

### కొత్త చిత్రాల టైటిల్స్

'అల్లరి బుల్లోడు' - 'ఘరానా బుల్లోడు' 'సి.బి.ఐ. స్పెషల్ స్క్వాడ్' - భారతి ఫిలిమ్ డివిజన్, 'అమ్మకొడుకు' - శేఖర్ బ్రదర్స్, 'బాపూజీ భారతం' - జయశ్రీ చిత్ర, 'హృదయ సంగమం' - రామ్ రాజ్ కళా మందిర్, 'కొడుకు పుడతాడు'

## తెలుగు సినీ రంగానికి పరిచయ మౌతున్న కొత్త సంగీత దర్శకులు

తెలుగు సినీ పరిశ్రమలో పలు శాఖలు కొందరికే ధారాదత్తం అయిపోవడం వల్ల ప్రతిభ కొరవడి పోతూంది. మణిరత్నం, భారతీరాజాల వంటి వారు తప్ప అనే కొత్త తరాన్ని ప్రోత్సహించి వాడుకొనే సత్తా లేక పోయింది. నెల్లూరీయుడు సత్యారెడ్డి తాజాగా తీసిన 'దొంగలొస్తున్నారు జాగ్రత్త' లో చిత్రంగా 'నవీన్–జ్యోతి' కొత్త సంగీత దర్శకుల జంటను పరిచయం చేశారు. స్వయాన అన్నదమ్ములైన వీరు వృత్తిరీత్యా ఒకరు ఫ్లూటిస్టుగా మరొకరు తబలిస్ట్‌గా విడుదలైన చిత్రంలో మంచి ట్యూనింగ్ ఇవ్వడం వల్ల సత్యారెడ్డి వీరికి మరో చిత్రం 'నేరం' లో కూడా అవకాశం యిచ్చాడు. పాత వాళ్ల కోసం నెలల తరబడి 'క్యూ' లో నిలబడే బదులు ఇలాట్లా కొత్త తరాన్ని ప్రోత్సహిస్తే బాగుంటుంది కదా!



ప్రేమే నా ప్రాణం అంటున్న వరుణ్‌రాజ్‌తో డిస్కో శాంతి

## 50 ఏళ్ల నాటి చిత్రసమీక్ష

# వాహినీ వారి 'పోతన'

వాహినీ వారు తమ భక్తపోతనను – మొన్నటి దినం కమ్మటి తేనీటి విందుతో మదరాసు – ప్యారగాన్‌లో 'ప్రివ్యూ' చూపించారు.

ఈ చిత్రం వారి చిత్రాలలో తలమానికం, కథా సన్నివేశం – చిత్రనిర్మాణం – నటనలలో ఇంత నిగ్గుదీరినది వారి పటాలలోనే కాదు, తెలుగు చిత్రాలలో గూడ అరుదు అనవచ్చు. విశ్వమోహిని తర్వాత యింత హాయిని గూర్చిన ఫిలిం మరియొకటి నాకు కనుబడలేదు.

నిర్మాణం:

కథావస్తువు : వేమూరి వారి భాగవతానికి తేవప్పెరుమాళ్ళయ్య గారు వ్రాసిన ఉపోద్ఘాతం నుండి చాలా భాగం గ్రహింపబడినట్లున్నది. సముద్రాల వారు యిచ్చిన కథను రామనాథం తెరకు అనువుగా దిద్దినారు. అంటే సినేరియో – క్యామరా రామనాథం గారివి.

చిత్రనిర్మాణం : ఆద్యంతాలు సజీవంగా వున్నవి. శ్రీనాథ పోతనలు కథకు రెండు వూపిరి తిత్తులులాగ సమవుద్ధిలుగా కడవరకు నడచి ఒకరి కొకరు పోషించుకొంటూ వచ్చినారు. పోతన కొడుకు మల్లన పాత్ర పోతనను భిన్నమై పోతన పాత్ర భిన్నత్వ స్ఫోరకంగా వుండి యిద్దరి అంతరాన్ని బాగా ప్రదర్శించింది. స్త్రీ పాత్రలు కథకు అవసర అంగాలుగా వుండి శోభించినవి. చిన్నలక్ష్మి నటనతో ఫిలిమంతా శోభావంతమై – చిత్ర చైతన్యానికి పట్టుకొమ్మ అయింది.

రాముడు అతి చౌకగా



పోతనగా భక్తిపారవశ్యంలో చిత్తూరు నాగయ్య

ప్రత్యక్షమౌతూ పోతనకు సమయానికి అడుకోవడం – దైవభక్తులకు – చిన్న తరగతుల వారికి నచ్చినా శిల్పాన్ని మాత్రం కుంటుపరుస్తున్నది.

'అల వైకుంఠపురంబు' అనే పద్యాన్ని రాముడుపూరించడం పోతన ఆధ్యాత్మిక గొప్పను చాటినా కవితా ఘనతను దుమ్ములో కలుపుతున్నది. ఈ ఫిలిమును 500 ఏండ్లనాటి కలికాలపు పోతన అనే దృష్టితో చూస్తే ఈ మహాత్మ్యాలు అతకవు గాని దీన్ని ఒక భక్తి పురాణం క్రిందకు లాగుకొంటె అనౌచిత్య దోషానికి పాల్పడదు. ఈ చిత్రాన్ని యీ దృక్పథంతోనే విమర్శించాలేమో!

కొంద 11 పేజీలో



## స్త్రీ సమస్యలపై స్త్రీ నిర్మాతలు పూరించిన శంఖారావం

# రాజేశ్వరి కళ్యాణం

అతనొక తపస్వి. కాని అతను ఋషికాదు. అతను సినిమా దర్శకుడు కళకోసం కాదు అతని తపస్సు. స్త్రీ జాతి సమస్యల పరిష్కార మార్గంలో చైతన్యం సాధించడం కోసమే అతని తపస్సు. అతని తపస్సు ఆకృతి వేరు, ఆత్మవేరు. అతని తపస్సు ప్రగతిని గర్జించే గళం. బీడుపడ్డ జీవిత పొలాలను సస్యశ్యామలంచేసే హలం. ఆ తపస్వి ఎవరోకాదు. సినీ దర్శకుడు క్రాంతి కుమార్. అతను కథ వ్రాసి దర్శకత్వం వహించిన "రాజేశ్వరి కళ్యాణం" చిత్రంలో వితంతు వివాహ సమస్య స్థానం చేసుకుంది.

చిన్నతనంలోనె తనకు తెలియని స్థితిలో వివాహం జరగటం, ఆ వెంటనే వితంతువు కావటం జరిగిన రాజేశ్వరి అనే అందాల చిలిపి పిల్లకు వయసు వచ్చిన తర్వాత ఓ వృద్ధ దంపతులు. సమాజం కట్టుబాట్లను మూఢ విశ్వాసాలను ఎదిరించి మళ్ళీ పెళ్ళి జరిపించిన ఆదర్శ విధానమే ఈ చిత్రం ఇతివృత్తం.

వర్తమాన సామాజిక విషమ పరిస్థితులన్నిటిని నిర్మొహమాటంగా వ్యాఖ్యానించింది ఈ చిత్రం. అవసరమైనచోట స్త్రీ శక్తిని ప్రజ్వలింప చేసింది. సారా వ్యతిరేకోద్యమంలో స్త్రీ యుద్ధరీతిని చూపింది. వృద్ధ దంపతులు వితంతువైన రాజేశ్వరి పెళ్ళిమళ్ళీ జరిపించినప్పుడు వారికి ఎదురైన దుష్టశక్తులను మహిళలు ఉమ్మడిగా ప్రతిఘటించడం చూపబడింది. ఈ సంఘటనలు స్త్రీ జాతి ఉజ్వల భవిష్యత్తుకు ఊపిరి పోసి రూపాలు; ఆత్మగతమైన విమర్శకు ప్రేరణ నిచ్చే స్వరూపాలు.

**గ్రిద్దలూరు గోపాలరావు**

**చిత్ర సమీక్ష**

చిన్నతనంలోనె తనకు వివాహమై అవల వితంతువునయ్యానన్న గత విషయం తెలియనని రాజేశ్వరి పసుపు కుంకుమలతో చిలిపి అల్లరితో తిరుగుతూ పశువుల డాక్టర్ శంకరాన్ని ప్రేమించి పెళ్లిచేసుకోవాలను కుంటుంది. అది తెలిసిన రాజేశ్వరి సవతి తల్లి ఆమె వీపు మీద వాతలు పెట్టుంది. నుదుటి కుంకుమ తుడిచి వితంతువుగా మార్చేస్తుంది. ఇటువంటివి ఇంకా కొన్ని సన్నివేశాలు. జీవితాన్ని కన్నీటి కథలిగా మాత్రమే అనుభవిస్తున్న స్త్రీల దుర్భర స్థితికి నిదర్శనంగా నిలుస్తాయి.

ఈ పరిస్థితులలో వృద్ధ దంపతులుగా వున్న ఆ ఊరి మాస్టారు. ఆయన భార్య సూత్రధారులై శంకరంచేత రాజేశ్వరి మెడలో మంగళసూత్రం

కొంద 11 పేజీలో

జమీన్‌రైతు
సంవత్సరమంతా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00







# కార్మిక చట్టం లక్ష్యం పరిశ్రమల బాగుగా వుండాలి !

భారతదేశంలో పరిశ్రమల అభివృద్ధి, కార్మికుల శ్రేయస్సు రెండింటినీ దృష్టిలో పెట్టుకుని ఒక నూతన పారిశ్రామిక వివాద చట్టం తయారుచేయడానికి ఆలోచనలు జరుగుతున్నాయి. దేశంలో మొట్టమొదటి సారిగా 1920లో కార్మిక చట్టం -'ట్రైడ్ డిస్ప్యూట్ యాక్ట్' అమలులోకి వచ్చింది. 1938లో దానికి కొద్ది మార్పులు చేశారు. తిరిగి 1947లో అప్పటికి అనువైన మార్పులతో కొత్త చట్టం రూపొందించారు. ఈ 45 ఏళ్లుగా ఆ చట్టమే అమలులో వుంది. అయితే సమకాలీన పరిస్థితులకు ఇది ఏమాత్రం ఉపయోగపడటం లేదు. దేశంలో పరిశ్రమలు పెరుగుతున్నాయి. కార్మికుల సంఖ్య పెరుగుతున్నది. మారుతున్న పరిస్థితులలో యాజమాన్య-కార్మిక సంబంధాలలోనూ మార్పులు సంభవిస్తున్నాయి. కార్మిక సమస్యల పరిష్కారంలో ఈ చట్టం పెద్దగా వుపయోగపడటం లేదు. ఇది సమస్యలను పరిష్కరించేందుకు ఉద్దేశించినా, చట్టం పేరులోపరిష్కారం అనే పేరు లేక పోవడం వల్ల చాలా అపోహలకు కారణమౌతున్నది. దీని క్రింద ఏర్పడిన న్యాయస్థానాలను సైతం 'లేబర్‌కోర్టు'లని పిలవడం వల్ల యజమానులలో అనుమానాలను ప్రేరేపిస్తున్నది. చట్టంలోని నాలుగవ భాగంలో 'Conciliation' (సామరస్య పరిష్కారం) స్పష్టంగా వివరించి వున్నప్పటికీ, ఆ బాధ్యత నిర్దేశింపబడిన అధికారి నిర్ణయాలు కేవలం సలహా పూర్వకంగా మాత్రమే వుండడం వల్ల ఇటు యజమానులు, అటు కార్మికులు ఆ సలహాలను పట్టించుకోవడం లేదు. అందువల్లే సామరస్య పూర్వక సత్వర పరిష్కారాలు జరగడం లేదు. 'మధ్యవర్తిత్వం' ద్వారా వివాదాలు సరిచేసుకోవచ్చునని చట్టం నిర్దేశిస్తున్నా, దాన్ని ఎవరూ పట్టించుకోవడం లేదు. ఇందులో కార్మికులకు ఎటువంటి హక్కులూ పొందుపరచబడలేదు. అందువల్లనే అధికారాలు పుష్కలంగా కల్గిన కలెక్టర్ వంటి అధికారుల ద్వారా మాత్రమే వివాదాలు పరిష్కార మౌతున్నాయి. కొత్త చట్టంలో ఈ లోపాన్ని సరిదిద్దాలి!

యాజమాన్య- కార్మిక సంబంధాలలో మరొక కీలకమైన అంశం- రాజకీయాలు. భారత కార్మిక సంఘాలు రాజకీయ పార్టీలతో అనుబంధిత మౌతున్నాయి. దీనివల్ల పలు సమస్యలు ఉత్పన్న మౌతున్నాయి. రాబోయే కొత్త చట్టంలో, కార్మిక సంఘాలలో రాజకీయపార్టీల ప్రమేయాన్ని నిషేధించడం అవసరం. అది పరిశ్రమల అభివృద్ధికి, కార్మికుల నిజమైన సంక్షేమానికి కూడా ఉపకరిస్తుంది. ఏ యజమాని కూడా కార్మికులతో సమస్యలు పెంచుకోవడానికి పరిశ్రమ ఏర్పాటు చేయడు. కార్మికులూ రాజకీయాలతో సంబంధం లేకుండా పరిశ్రమ పరిస్థితులకు మాత్రమే పరిమితమై కార్మిక సంఘాలు ఏర్పర్చుకుంటే , ఆ పరిశ్రమలలో తలెత్తే వివాదాలు, సమస్యలు సామరస్య పూర్వకంగా, త్వరితంగా పరిష్కరించుకునేవీలు ఉంటుంది. ఇరువురిమధ్య సహృద్భావ వాతావరణం ఏర్పడుతుంది.

యజమాని కొన్ని పరిస్థితులలో తమ కార్మికులకు పనిచూపించలేని పరిస్థితి ఏర్పడుతుంది. దాన్ని "లేఆఫ్" అంటారు. బొగ్గు వంటి ముడి పదార్థాల కొరత, విద్యుత్ సరఫరా కొరత, యంత్రాలు పాడైపోవడం, తయారుచేసిన సరకు అమ్మకం కాక నిల్వవుండిపోవడం , వంటి కారణాల వల్ల పరిశ్రమలో కార్మికులకు పనిచూపలేని పరిస్థితి ఏర్పడితే దాన్ని 'లేఆఫ్'గా పిలవాలని చట్టం నిర్దేశిస్తున్నది. వాస్తవ పరిస్థితులలో చట్టం నిర్దేశించిన కారణాలేకాక ఇతరత్రా కారణాలవల్ల కూడా యజమానులు తమ కార్మికులకు పని ఇవ్వలేక పోతుంటారు. పని గంటలు మొదలైన తర్వాత రెండు గంటలలోగా యజమాని పని




ఇవ్వలేకపోతే, ఆ పనిలేని కార్మికులను కూడా లేఆఫ్ క్రింద పరిగణించవచ్చు. అయితే పాత చట్టంలోని ఐదవ అధ్యాయం ప్రకారం లేఆఫ్ ప్రకటించే అధికారం యజమానికి లేదని న్యాయస్థానాలు తీర్పు చెప్పివున్నాయి. ఈ అధ్యాయంలో లేఆఫ్ పరిస్థితులను వివరించి వున్నారు. ఇందులో రిట్రెంచ్‌మెంట్ ( నిర్బంధ పదవీ విరమణ) ఒకటి. మొదట ఈ పదానికి " పరిమితిని మించిన కార్మికులను తొలగించుట" అని నిర్వచనం చెప్పారు . ఏ సంవత్సరంలోనైనా 45 రోజులకు మించి కార్మికులను లేఆఫ్ క్రింద వుంచవలసి వస్తే, వారికి పరిహారం ఇచ్చి, తొలగించే పద్ధతిని కూడా రిట్రెంచ్‌మెంట్ అంటున్నారు. ఈ అధికారం యజమానికి వుంది. పైన చెప్పిన అధ్యాయంలోనే పేర్కొనబడిన " స్టాండింగ్ ఆర్డర్స్" అనే ప్రకరణం ప్రకారం ఈ అధికారం యజమానికి సంక్రమిస్తుంది. లేఆఫ్ చేసే అధికారం యజమానికి లేకపోయినా, కార్మికుడికి పని కేటాయించే అధికారం యజమానికి వుంటుంది. సర్వీసు షరతులలో ప్రతి యజమానీ ఈ అధికారాన్ని తన పరంగా వుంచుకోవాలి!

పాతచట్టం ప్రకారం, కార్మికులకు పనిఇవ్వలేని పరిస్థితులలో మాత్రమే పరిహారం చెల్లించి, తొలగించవచ్చు తప్ప- యజమానులు తమ ఆర్థిక, ఆరోగ్య, కుటుంబ పరిస్థితుల ప్రభావంతో లేదా అనూహ్య కారణాలతో లేఆఫ్ ప్రకటించ లేక పోతున్నారు. ఈ అధ్యాయానికి 1975 లో 'ఐదు-బి' అనే కొత్త ప్రకరణం చేర్చి, కొన్ని సవరణలు చేశారు. దాని ప్రకారం 1300 మంది కార్మికులున్న పరిశ్రమలకు ఆ చట్టం వర్తిస్తుంది. తర్వాత మళ్లీ సవరణ చేసి 100 మంది కార్మికులు వున్న పరిశ్రమలకు చట్టాన్ని వర్తింప చేశారు. సీజనల్ పరిశ్రమలకు మాత్రం ఈ అధ్యాయం వర్తించదు. లేఆఫ్, రిట్రెంచ్‌మెంట్, క్లోజర్ అనే మూడు పరిస్థితులకు ఈ అధ్యాయం వర్తిస్తుంది. ప్రభుత్వ కార్పొరేషన్లను దీని నుంచి మినహాయించారు. 1978 లో ఈ 'ఐదు-బి' అధ్యాయం పైన సుప్రీంకోర్టు విచారణ జరిపి, ఇది రాజ్యాంగ చట్ట విరుద్ధమని, ప్రాథమిక హక్కులకు భంగకరమని తీర్పు చెప్పింది. ఈ తీర్పును మనసులో వుంచుకొని, కొన్ని సవరణలు చేశారు. ఆ సవరణలు సక్రమమని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పింది.

అయితే కోర్టులు ఈ అధ్యాయం రాజ్యాంగ బద్ధం కాదని తీర్పు చెప్పినా, అందులో ఆచరణ యోగ్యం కాని విషయాలు, లోపాలు కొత్త చట్టం రూపకల్పనలో గుర్తింపవలసివుంటుంది.

వాటిలో ముఖ్యమైనవి ఇవి–

25 ఎం నిబంధన ప్రకారం కార్మికులను లేఆఫ్ చేయాలంటే ఈ క్రింది నిబంధనలు పాటించాలి!

1) లే ఆఫ్ ఇవ్వడానికి నిర్ణయించుకున్నట్లు లేబర్ కమీషనరుకు దరఖాస్తు చేయాలి; అందులో కారణాలు వివరించాలి;

2) విద్యుచ్ఛక్తి లోపం లేదా అనివార్య దురదృష్ట పరిస్థితులైతే ఆ వివరణ అవసరం లేదు; 3) ఆ దరఖాస్తు కాపీని కార్మికులకు అందచేయాలి 4) లేబర్ కమీషనరు ఆ దరఖాస్తు పరిశీలించి, కారణాలు సమంజసమని, సమర్థనీయమని గుర్తించి, కార్మిక శ్రేయస్సు పరిగణనకు తీసుకుని 60 రోజుల లోపల తీర్పు చెప్పాలి; 60 రోజులలో తీర్పు రాకుంటే లేఆఫ్ అనుమతించినట్లు లెక్క; పై అనుమతి సంవత్సరం పాటు అమలులో వుంటుంది; 6) లేబర్ కమీషనరు అనుమతి నిరాకరిస్తే ట్రిబ్యునల్‌కు అప్పీలు చేయవచ్చు; ట్రిబ్యునల్ 30 రోజుల లోపల తీర్పు చెప్పాలి. ఈ నిబంధనలకు విరుద్ధంగా ప్రవర్తిస్తే లే ఆఫ్ చట్ట విరుద్ధమౌతుంది.

ఏ కార్మికుడినైనా రిట్రెంచ్ చేయవలసి వస్తే, అతడికి 3 నెలల నోటీసు ఇవ్వాలి; [illegible]రి దగ్గర ముందుగా అనుమతి పొందాలి; ఆ అధికారి 60 రోజుల లోపల విచారణ జరిపి, రిట్రెంచ్‌మెంట్ సమంజసమో కాదో నిర్ధారించాలి. యజమాని తన వ్యాపారాన్ని, లేదా పరిశ్రమను నిలిపివేయాలన్నా పై షరతులు పాటించాలి.

ఈ నిబంధనలకు కొత్త చట్టంలో మార్పులు చేయవలసిన అవసరం వుందా లేదా అన్నది ప్రభుత్వం పరిశీలించాలి. ఈ సందర్భంలో కార్మిక శ్రేయస్సు మనసులో వుంచుకోవలసిన అవసరం వుంది. అధికారుల అనుమతి లేదా నిరాకరణ, ఆ తర్వాత ట్రిబ్యునల్ తీర్పుల మధ్య కాలంలో వారికి ఇచ్చే పరిహారం రాబట్టుకునేందుకు ఎటువంటి హక్కు కల్పించబడలేదు. లేఆఫ్, రిట్రెంచ్‌మెంట్, క్లోజర్ అనేవి ప్రాథమిక హక్కులు. వీటిపై సహేతుక శ్రేయస్సు దృష్ట్యా కొన్ని నిబంధనలు విధించ వచ్చు కాని ఆ నిబంధనలు అమలు కాని పక్షంలో అనవసర కాలహరణ, పరిశ్రమలో అశాంతి, నిరుత్సాహం, వివాదాలకు దారితీస్తుంది. ఏదో ఒక సందర్భంలో 10 రోజులు లే ఆఫ్ చేయవలసి వస్తే – ఆ లే ఆఫ్ ఉత్తర్వు సంవత్సరం వరకు అమలులో వుంటుందని అనడంలో అర్థమేమిటి? ఒక డిపార్ట్‌మెంట్‌లో ఒకర్నో, ఇద్దరినో తీసి వేయదలచినప్పుడు కూడా పై షరతు పాటించమనడమేమిటి? ఆర్థిక ఇబ్బందులతోనో, మరొక అసౌకర్యంతోనో యజమాని తన పరిశ్రమ మూయదలచినప్పుడు, అధికారి నిరాకరిస్తే కోర్టులో అంగీకరించే వరకు యజమాని పరిస్థితి ఏమిటి? కార్మికులను ఎట్లా పోషించాలి?

అందువల్ల యజమాని లేఆఫ్, లేదా రిట్రెంచ్‌మెంట్ లేదా క్లోజర్ తలపెట్టినప్పుడు అవి జరపడానికి యజమానికి స్వేచ్ఛ ఇచ్చి ఆ తర్వాత అది సమంజసమా కాదా అని విచారించి, నిర్ధారించడం మంచి పద్ధతి. తుది తీర్పు యజమానికి వ్యతిరేకంగా వస్తే కార్మికులకు నష్టపరిహారం చెల్లించమన వచ్చు. లేకుంటే ఇద్దరూ నష్టపోవడమే కాక, పరిశ్రమలు పెట్టడానికి ఎవరూ ముందుకు రారు. ఈ అధ్యాయం ఎమర్జెన్సీ సమయంలో ప్రవేశ పెట్టబడింది; ఇప్పుడా పరిస్థితులు లేవు. అందువల్ల ఈ అధ్యాయంలో మౌలికమైన మార్పులు చేసి కొత్తచట్టం రూపొందించడం అవసరం.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

సభ్యులుగాను ఎన్నుకోబడ్డారు. వారికి మా అభివాదాలు-

బ్యాంకిలో డబ్బు నిల్వలో వుంది. యెడైనా ప్రజాభ్యుదయ కార్యాలకు వినియోగించే ప్రణాళిక సిద్ధంచేసి అమలు జరిపితే బాగుటుంది.

కలరా రిపోర్టు
(9-1-43వరకు)

| | తగిలిన వారు | చచ్చిన వారు |
|---|---|---|
| గూడూరు టవును | 4 | 3 |
| కావలి(బోగోలు) | 1 | 1 |
| కోవూరు తాలుకా | 111 | 81 |
| రాపూరు తా. | 2 | 2 |
| సూలూరు పేట తా. | 16 | 13 |
| వెంకటగిరి తా. | 30 | 16 |
| కుల్లు | 176 | 123 |

అరెస్టులు -కేసులు

ఊరుబిండి నిత్యానందం అనే స్కూలు ఫైనలు విద్యార్థిని 10 తేది మూలపేటలో అరెస్టుచేసి డిటెన్యూగా బంపిరి-

త్వరకవి నారాయణరావు గారి కేసు 22తేదికి డిఫెన్సు విచారణకు ఆమంచర్లలో వాయిదా-

అల్లూరు పోలీసు స్టేషన్ తగుల బెట్టిన కేసు 26 తేది తిరుగా విచారణ-

వెంకటగిరి సబ్‌యిన్‌స్పెక్టరు కేసు 9తేది నుండి తిరుగా వాయిదా బడింది. వకీలు సారంగపాణిగారు ముద్దాయి ప్రక్క వకాల్తు వదలుకున్నారట.

## పోతన

(9 పేజీ కారవ)

శ్రీనాథుని ప్రవేశం ఫిలిముకు జీవకళం. అది మొదటి దశ్శి. మేనాలో వస్తూ ఒక స్త్రీని వర్ణిస్తారు. వీరి నాటకం వ్రాసిన శ్రీనాథుడికి యిది సహజమే కాని ఆమెను చిత్రకారునికి 'పోజు' ఇచ్చినట్లు నిలువబెట్టడం అసహ్యంగా వుండినది. ఇక సర్వజ్ఞుని ఆస్థాన ప్రవేశం – రామణీయక స్త్రీ జనస్వాగతం – కళాపూర్ణంగా ఆనంద విహ్వాలుల జేస్తున్నవి. ఆ తర్వాత భోగిని విలాసనృత్యం మధురతర దృశ్యం! కులకర్ణి గారి నవ్యపోకడలను పూర్వ నృత్యంలో కలిపి రామణీయకంగా నటించింది భోగిని. (నటించింది ఎవరో?)

ఫిలింలో ఒక రౌడిని ప్రవేశ పెట్టారు. యితడు కథకు ఒక ముఖ్యాంగంగా వుండినా చివర వరకు పేరు తెలియకుండా పోవడం పాపం అతడి (నటకుడు గాదు) దురదృష్టం. ఈ భూమిక చాల విలక్షణంగా నడిచినది. నటకుడు గూడ స్వైర విహారాన్ని – రౌష్ట్యాన్ని బాగా ప్రదర్శించారు. వంటే మాతరంలో రాజాబహదూర్ వలె ఇది ఒక నవ్యసృష్టి.

దీనిలో ఒక చిన్నలోపం: శ్రీనాథుడు అలిగి కూతురును తీసుకొని పోయిన నాటి రాత్రి రౌడిని హనుమంతుడు ఝాడిస్తాడు. తిరిగి శ్రీనాథుడు – ఎన్నో దినాలకు – ఎవరు గాని పిలువకుండానే కూతురుని వెంటబెట్టుకొని వచ్చిన తర్వాత గ్రామస్థులు రౌడిని తీసుకొని వచ్చినట్లు – వాడు 'నిన్న రేత్రి' 'యిది జరిగినట్లు' అనడం మాత్రం ఎడిటింగు లోపమంటే బాగుంటుందేమో!

పోతన ఇంటి బయట బ్రాహ్మణత్వం ద్యోతకం కాక, కాపుకుటుంబం మాదిరే వున్నది. దీనికి తోడు మల్లన వేషం – చేష్టలు నిండు శూద్రత్వాన్ని చూపినవి. హాలికులైన శ్రోత్రియ కుటుంబాలు ఎన్ని లేవు? వాటిలో తొణికే బ్రాహ్మణ వాతావరణం యిక్కడ ప్రదర్శితం కాకపోవడం నిర్మాణంలో ఒక స్వల్పలోపం.

పోతన భక్త్యావేశంతో పొంగి – సైకు టికిన పారవశ్యంతో పాడిన పాటతో చిన్నకూతురు కలుసుకుని పాడటం అసహజం! అప్పుడే పుట్టిన ఈ పాటను అంతకు ముందు బిడ్డకు నేర్పడం ఎట్లా సాధ్యం? ఒకటే విధంగా పాడటం అంతకు ముందే అసాధ్యం.

చిత్రంలో మల్లన ఏ విషయంలో గాని పోతనకు తగిన కొడుకనిపించు కోలేదు. ఇక శ్రీనాథుడికి ప్రతిగా ఎద్దులు లేకుండా నాగలి సాగించడం ఇతనికి సాధ్యమైంది కాదేమో; దీన్ని పోతన చేతనే చేయించి. "బాలరసాలసాల" పద్యం ఆయన చేతనే చదివిస్తే బాగుండేది. అంకితం యిచ్చి దారిద్ర్యాన్ని బాపలేదని చీటికి మాటికి కోపబడే మల్లనకు కావ్యకన్యకను కూళలకివ్వడం తప్పుగా తోచి వుంటుందా? "ఇమ్మను జేశ్వరాధములకిచ్చి" అనే పోతన పద్యాన్ని రాజా చేత పలికించడం ఔచితే!

"కాటుక కంటి నీరు చనుకట్టుపై బడనేల ఏడ్చెదో" అనే పద్యం హృద్యంగా భావగర్భంగా చదువబడింది. కాని ఆ భారతికి చన్ను లేకుంటే పోయింది గాని చనుకట్టయినా చూపి వుంటే బాగుండేది!

పోతనకు రాముడు ప్రత్యక్షమైనప్పుడల్లా సీతారాములు మాత్రమే కనుపిస్తారు. అడవులలో నానా కష్టాలు పడిన లక్ష్మణుని రాముడు ఎక్కడ దిగనాడినాడో తెలియదు. గ్రహణం నాడు పోతనకు సీతారాములు ప్రత్యక్షమైనా క్రింద పడవిప్పాం రాముడిదే కనబడుతుంది సీత భూమి మీద కాలూనదా?

ఇటువంటి చిన్నలోపాలు వున్నా ఇవి కథా దక్షత గాని, ఫిలిం అందానికి గాని లోటును గూర్చలేదు. ఫిలిం 16500 అడుగులైనా ప్రేక్షకుడు పొందే తన్మయత్వం వల్ల అతి త్వరగా జరిగిపోయి నట్లుంటుంది.

దర్శకత్వం చేసిన కె.వి. రెడ్డి గారు – కథా వస్తువును ఉజ్జీవింప జేయడంలో, చిత్రాన్ని కళాపూర్ణంగా సృష్టించడంలో మంచి నేర్పును చూపినారు.

ఇందలి ఫోటోగ్రఫీ మృదువుగా ఇంపుగా వున్నది. చిన్నలక్ష్మి సూర్యోదయ సమయంలో పాడిన పాట ఘట్టం, హనుమంతుడు కనబడే దృశ్యం మనోహరంగా వున్నవి.

ట్రిక్కు సీనులు (ముఖ్యంగా హనుమంతుడు – రౌడీ ఘట్టం) పామర జనాన్ని ఆనంద చకితం చేసి పెద్దలకు విస్మయం గూరుస్తున్నవి.

శబ్దగ్రహణం బాగా వున్నది. ఇక శేఖర్ గారి శిల్పం అన్నిటా ఎన్నదగి వున్నది. పోతన వీధి – రాజ దర్బారు హృదయరంజకంగా వున్నవి. రాజగృహం ఏ అజంతా ప్రాంగణమో అనిపించింది.

మాటలు: సముద్రాల వారి సానలు దీరిన ప్రజ్ఞను చాటుతున్నవి. ఇంత పొంకంగా, అర్థయుక్తంగా పదటం చాలా అరుదంటే అతిశయోక్తి గాదు. భాగవతాన్ని జీర్ణం చేసుకుని, భాగవతం వ్రాసిన పోతన మాదిరే వ్రాశారు – అంటే పోతనే మాట్లాడినాడా అనిపించింది. శ్రీనాథుడు ఇంటరేపిన తుఫానును ప్రతిహరించను పోతన వాడిన భాష ఔచితీపూర్ణం. 'మల్లన దగ్గర హరిజేరు మనియెడి తండ్రి తండ్రి' అని వీపు తట్టడం సొగసుగా వున్నది.

శ్రీనాథుని భాష గూడ ఇట్లే ఒక ప్రత్యేకతను చాటుచున్నది. మల్లన భాష కడవరకు యౌవనపు ఉధృతాన్ని వెదజల్లినది.

చిన్నలక్ష్మి శ్రీనాథుణ్ణి యింటి గుమ్మం దగ్గర తలపంచుకొని రమ్మనడం – ముందు జరగబొయ్యే విషయం నిర్దేశంగా వున్నది. ఈమె ముద్దులొలికే మాటలే కథను నడుపుతూ వచ్చినవి.

చిత్రం ప్రారంభంలో టైటిల్సును బ్యాక్ గ్రౌండ్ నాగయ్య గారు "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అన్న గీతాశ్లోకంతో ప్రారంభించి మరికొన్నిటి జదివి అట్లనే కథలోకి దిగి రాజపూజతో పోతనగా ప్రారంభించడం బాగున్నది.

పోతన గ్రంథ రచనాదృశ్యం– 'వైపులు' – 'మిక్సరు' అందంగా కుదిరి, చిత్ర సర్వతోముఖ పరిపూర్ణత్వానికి సహాయపడుతున్నవి.

నటకులు:

నాగయ్యగారు అపర పోతనైనారు. అమృతాక్షర శోభితుడైన భాగవతోత్తముని బాగా అర్థం చేసుకొని, తానే పోతనై వెలసినాడు గాని నటించ లేదు. పద్యాలు అర్థపూర్ణంగా చదివినారు. ఫిలింకంతా గానం వీరిదే అయినా వెగటు పుట్టలేదు.

శ్రీనాధుడు ఎవరో గౌరిపతి శాస్త్రి అట! నిజంగా చాలా దర్పంగా చేశారు. శ్రీనాధుని గూర్చిన కథలన్నిటినీ చదివి భావించుకొన్న రూపం కండ్లకు కట్టినట్లు ప్రత్యక్షమైనాడు. నటన సహజమైంది. కంఠధ్వని గంభీరం. కవిసార్వభౌమునికి అనువైన రాచరికపు నడకలు బాగా వొప్పించాడు. ముఖ్యంగా రాజుకు పోతన అంకితం యివ్వనన్నప్పుడు – ఇంటి ఒక్కొక్కరిని రెగగొట్టదలచుకొని చేసిన ఉపన్యాసం షేక్స్పియర్ 'బ్రూటస్' పాత్ర జ్ఞాపకానికి వచ్చింది. ఆ తర్వాత నాగయ్య దీనిని ప్రతి ఘటించను చేసిన సరళ భాషణ – నటనలు 'అంటోని' ని జ్ఞాపకానికి తెచ్చినవి. ఇక్కడ కవి, నటకులు, దర్శకుడు, ఛాయాగ్రహకుడు, అందరూ తమ కళలను ఉన్నత శిఖరానికి తీసుకొని పోయినారు. బిడ్డ లక్ష్మి – కొత్త ఐనా మహా ఫ్రీగా నటించింది. ఫిలింకు జీవం యీమె పాత్రే. ఇక నటన కదిలించి వేసింది. పాట ముగ్ధుల చేసింది. ఈమెకు ఫిలిం కొసవరకు ఒకే పావడ రవిక కాకుండ మార్చివుంటే బాగుండేది.

ఈ సర్వాంగ సుందరమైన ఫిలిందు సృష్టించినందుకు వాహిని వారు ప్రశంసాపాత్రులు. వారి కొలమానానికి ఇందు మెరుగు పెట్టినారు. యిది పండిత పామరులకు అందరకు నచ్చగలదు.

(8-1-1943 జమీన్‌రైతు నుండి)

---

## మతాన్ని త్యజిద్దాం

కె.వి. చలపతిరావు

అంతరిక్షంలో అడుగుపెట్టాం
అయినా ఆశ చావలేదు!
గాలిలో అలవోకగా ప్రయాణిస్తున్నాం
కానీ తృప్తికలుగలేదు!
నీటి పై దేశాలను చుట్టి వస్తున్నాం
అయినా పరిశోధనలు ఆగలేదు!
రోజు రోజుకు ముందడుగు వేస్తున్నాం
అయినా సరే మనల్ని వెక్కిరిస్తూ
అపహాస్యం పాలు చేస్తూ
మన చరిత్రను ఇంకా ఇంకా
వెనక్కు తీసుకెళ్లి
అప్రతిష్ట తెస్తున్న మతం!
మనదేశ అత్యున్నత విలువలనే
అభాసుపాలు చేసిందీ మతం!
ఓ మనిషీ, మేలుకో
అడుగు ముందుకు వేసి
మనందరిదీ ఒకే జాతి
అదే భారతజాతి అంటూ కలసి కట్టుగా
ప్రచారం చేద్దాం!
మతాన్ని
పరిత్యజిద్దాం!

---

## చిత్రసమీక్ష

9 పేజీ కారవ

కట్టిస్తారు. అది తెలుసుకున్న రాజేశ్వరి సవతి తల్లి రాజేశ్వరిని మళ్ళీ వితంతువును చేస్తానని ప్రతిజ్ఞ చేస్తుంది. వైద్య పరీక్షకు పట్నం పోయి తిరిగి గోదావరినది మీద బోటులో ఇంటికొస్తున్న నిండుగర్భిణి రాజేశ్వరిని, శంకరాన్ని సవతి తల్లి నియమించిన రౌడీలు ఢీకొంటారు. శంకరాన్ని వితక బాది గోదావరిలో పడేస్తారు. అబీభత్సం



నూతన సంవత్సరారంభాన్ని స్వాగతిస్తూ రాజరాజేశ్వరి దేవస్థానంలో జేబి ప్రత్యూష నయనానందకర నృత్యం

చూసిన రాజేశ్వరి కంపించిపోయి గావుకేకల్లో మగబిడ్డను ప్రసవించి ఆబోటులోనే చనిపోతుంది. కాని ఆమె వితంతువుగా చనిపోలేదు. ముత్తైదువుగానే చనిపోతుంది. గోదావరి పాలైన శంకరం బ్రతికి కొంతకాలానికి మరలా కనిపిస్తాడు.

రాజేశ్వరి చావుతో చేసిన ముగింపు బాగుంది. ఎందుచేతనంటే ఆచావులో ఒక ప్రయోజనముంది. ఒక ప్రళయముంది. ఊపునందుకునే ఉద్యమ ముంది. సమాజంలోని మూఢ నమ్మకాలకు, దుర్మార్గాలకు ముగింపు జరగాలన్నది , ఈ ముగింపు ధ్యేయం.

తన సవతి తల్లి మూఢనమ్మకాలకు బలైపోయిన రాజేశ్వరి సమాధి అయిపోతుంది. ఇలా ఎందరో రాజేశ్వరులు సమాధులైపోతున్నారు. ఈ సమాధుల్లో సంచలనం కలగాలని, అవి అగ్నిపర్వతాలై ధరిత్రిని చీల్చుకొని పొంగిపొరలి సమాజంలో రావణ కాష్టంలా రగులుతున్న స్త్రీ సమస్యలను దగ్ధం చెయ్యాలన్నది దర్శకుని ఆశయం.

యువ దంపతులుగా ఒకనాడు ఒళ్లు విరిచి మైమరచి కదంతొక్కిన అక్కినేని నాగేశ్వరరావు, వాణిశ్రీలు ఇందులో వృద్ధదంపతులుగా నటించారు. ఒక యువతరంలా, నవశకంలా, సమాజంమీద తిరగబడి ఆదర్శం కోసం, అభ్యుదయంకోసం శాంతి యుద్ధం సాగించారు. అల్లరి పిల్లగా ఆనందంగా, వితంతువుగా విషాదంగా, ఇల్లాలుగా ఉత్తమంగా రాణించింది రాజేశ్వరి పాత్రలో మీనా. సురేష్ భలేగా నటించాడు. సవతి తల్లిగా తొణకని గాంభీర్యంతో తేనెపూసిన కత్తిలా వ్యవహరించింది. గుమ్మడి గొప్పగా నటించారు. బ్రహ్మానందం, బాబూమోహన్‌ల హాస్యం కంటే, మీనా చేసిన చిలిపి అల్లరి ఎక్కువ హాయిని కలిగించింది.

స్త్రీల సమస్యకు సంబంధించిన ఈచిత్ర నిర్మాతలు, విజయలక్ష్మి, పద్మజవాణి అనే ఇద్దరు స్త్రీ కావటం విశేషం. చిత్రంలో తెలుగు గ్రామీణ వాతావరణం అచ్చతెలుగు సాంప్రదాయం తొణికిసలాడటం మరో విశేషం.

## సజుగుడు

(4 పేజీ కొరవ)

కంటె హీనమైన దీనస్థితిలో ఈ లా పోస్ట్ గ్రాడ్యుయేట్ల చేత వాకిటి వేయించుకుంటున్న యాజమాన్య దైన్యాన్ని అభినందించి తీరాలి. వారిని మనశ్శాంతితో బ్రతికే విద్యార్థులు క్లాసులు జరిగినట్లు ప్రిన్సిపల్ సంతకం పెడితేనే ఈ ముష్టిజాలపై రూపాయలైనా ఇచ్చేది; మాట వినకుండా పోతున్నారని అనుమానం వస్తే వారిని ఆ కాగితంపై సంతకం పెట్టకుండాచేస్తున్నారట. తమ పదవులనే తాకట్టుపెట్టి తమ ఉద్యోగాలకు జరిగే అన్యాయాన్ని చూస్తూ సహించే ఈ అధ్యాపకులు ఇక విద్యార్థులకు ఏమి న్యాయం చేకూరుస్తారు? లెక్చరర్లకు జీతాలివ్వక, కాలేజీకి కుర్చీలు బెంచీలు కూడా కొనక, ఏ సౌకర్యమూ ఏర్పర్చక స్పెషల్ ఫీజురూపంలో వచ్చే 12 లక్షలు ఏమి చేస్తున్నట్లు?

లైబ్రరీ డిపాజిట్ పేరుతో విద్యార్థికి రెండు వందల లెక్కన దండుతున్నారు. ఏటా రెండు లక్షలకు పైబడి వస్తుందా సొమ్ము. నిబంధనల ప్రకారం దానిని ఏదో ఒక బ్యాంకులో ఫిక్సెడ్ డిపాజిట్ చేయాలి. కాని చేయడం లేదు. ఆ డబ్బంతా యాజమాన్యం జేబుల్లోకి పోతున్నది. వడ్డీలకు తిరుగుతున్నది. యూనివర్సిటీ డెవలప్‌మెంట్ ఫీజు క్రింద ప్రతి విద్యార్థి నుంచి ప్రతి ఏటా కొంత డబ్బు దండుతున్నారు. కాని కాలేజి పుట్టినప్పటి నుంచి ... ఏదు యూనివర్సిటీకి చెల్లిగవ్వ ...ంచలేదట. ఎన్ని లక్షలు ఆ రూపంలో దిగమింగుతున్నారో లెక్కించలేము. కాలేజి నుంచి రావలసిన కంట్రిబ్యూషన్ రావడంలేదు కాబట్టి, లా కాలేజి విద్యార్థులను విశ్వవిద్యాలయం నిర్వహించే ఆటల పోటీలకు అనుమతించడం లేదు. అంతకంటే సిగ్గుచేటైన విషయం వేరొకటి వుందా? ఎక్స్‌ట్రా కరిక్యులర్ యాక్టివిటీస్ పేరుతో 5, హ్యాండ్‌బుక్ పేరుతో 3, గేమ్స్‌కు 4... ఇట్లా వివిధ పేర్లతో ప్రతి విద్యార్థినుంచి 104 రూపాయలు వసూలుచేస్తున్నారు. కాని లిస్టులో పేర్కొన్న ఏ పనీ చేయరు. ఆ డబ్బంతా ఏమైపోతున్నదీ చెప్పరు. ఆఖరకు స్టూడెంట్స్ యూనియన్ వార్షికోత్సవాలు, ఎన్నికలను కూడా ఉప్పుచప్పుంగా జరిపించేస్తున్నారు.

ఈ విషయమై విద్యార్థులకు, ప్రిన్సిపల్‌కు తరచూ వాగ్వివాదాలు జరుగుతున్నట్లున్నాయి. గత సంవత్సరం యూనియన్ అధ్యక్షుడు శ్రీ సివి రమణారెడ్డి ప్రిన్సిపల్‌ను లెక్కలు చెప్పమని నిలదీశాడట. దానితో ఆ విద్యార్థిని నానా యాతనలు పెట్టారు. ఆఖరకు అతని పరీక్షలంక్ష పేపరులో అదే కాలేజీలో పనిచేస్తున్న ఒక లెక్చరర్ చేత సున్నాలు వేయించారట. రమణారెడ్డి ధైర్యవంతుడు కాబట్టి యూనివర్సిటీకి ఫిర్యాదు చేసి, రీవాల్యుయేషన్ పెట్టించి పాసైనాడు. యాజమాన్యం ఏదిచెబితే దాన్ని తల ఊపుతూ, మూతినాకుతూ తిరిగే హీన స్వభావులు ఆఖరకు తమ విశ్వాసం ప్రదర్శించేందుకు పిల్లల భవిష్యత్తను పాడు చేయడానికి కూడా సిద్ధపడ్డారంటే ఏమనుకోవాలి? అటువంటి వారిని అయ్యవార్లుగా గౌరవించడానికి మనసు వస్తుందా?

తిలా పాపం తలా పిడికెడు అన్నట్లు, యాజమాన్యం తమ పాపపు పనులలో ప్రిన్సిపల్‌నూ భాగస్వామ్యం చేస్తున్నట్లుంది. ఆయన్ను అమాయకుడనాల్నో, మరేదైనా పదంతో పిలవాల్నో తెలియదు కాని, ఏ నిర్ణయమూ స్వంతంగా తీసుకోలేరు. ఆఖరకు ఎన్నికలు నిర్వహించే స్వేచ్ఛ కూడా ఆయన పుంచుకోవడం లేదు. ప్రతిదీ పైనుంచే రావాలి. మొన్నటి విద్యార్థి వార్షికోత్సవాన్ని జరిపించేందుకు ముందు డబ్బు లేదన్నారట; విద్యార్థులు గట్టిగా దబాయించి లెక్క పక్కలు అడిగే సరికి, తత్తరపడి, మూలవిరాట్టు సలహాతో, ఎంతైనా ఖర్చు పెట్టండి, ఇస్తామని చెప్పారట. తీరా ఫంక్షన్ పూర్తి అయిన తర్వాత పిల్లల నుంచి ఓచర్లు మాత్రం తీసుకుని, కొంత డబ్బు ఎగ్గొట్టారట. అదేమని అడిగితే - రామసుబ్రహ్మణ్యంగారు- అదంతే, అన్నారట. ఇప్పుడు విద్యార్థులు దీనిపై కోర్టులో కేసు దాఖలు చేయబోతున్నారు. ఆ కాలేజి పైన ఇప్పటికే ఎన్నో కేసులు వున్నాయి.

కాలేజి నిర్వహణలో అతి పెద్ద బోగస్ కార్యక్రమం - కార్పస్ ఫండ్ ఏర్పాటు. స్పెషల్ ఫీజులు, ఇతర వసూళ్లలో ఖర్చులు పోను మిగిలిన సొమ్మును స్టూడెంట్స్ యూనియన్ తీర్మానంచేసి, ఎందుకు మిగిలిందో కారణం చూపి, డైరెక్టర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్ అనుమతితో కార్పస్ ఫండ్‌కు జమ చేయమని రూలు. ఆ ఫండ్‌తో విద్యార్థుల సంక్షేమ కార్యక్రమాలు చేపట్టాలి. వివిధ పేర్లతో దండే ఫీజులనుంచి ఏ పనీ చేయపోతిరే, మరి ఆ డబ్బంతా ఏమి చేస్తున్నారని అడిగితే - కార్పస్ ఫండ్‌కు బదలీ చేస్తున్నామని చెప్తారట. కాని స్టూడెంట్స్ వెల్ఫేర్ అనేది కాలేజి చరిత్రలో ఇప్పటి వరకు జరగలేదు. మంచినీళ్లకు కటకటగా వుందని గోల చేసినా పట్టించుకోలేదు. విద్యార్థులే కాలేజి మ్యాగజైన్ మానుకొని ఆ డబ్బుతో ఒక కూలర్ తెచ్చి, బిగించుకున్నారట. యాజమాన్యం వాస్తవ రికార్డులు వెల్లడి చేస్తే 1974 నుంచి ఇప్పటివరకు కార్పస్ ఫండ్‌లో కొన్ని లక్షల రూపాయలు జమ పడివుండాలి; కాని ఒక్క రూపాయి కూడా లేదు; సర్వం వారికి తీర్థం.

ఎస్.సి. బి.సి. విద్యార్థుల ఫీజులను ప్రభుత్వం రీ ఇంబర్స్ చేస్తుంది. ప్రభుత్వమేమో క్రమం తప్పకుండా వాటిని చెల్లిస్తున్నది. ఇటీవల ఒకే ఒకమొత్తంగా 14 లక్షలు వచ్చిందట. అంతకు క్రితం 6 లక్షల 80వేలు వచ్చిందట. ఈ డబ్బంతా ఏమై పోతున్నది? ఎవరి ఇళ్లలో కనక వర్షం కురిపిస్తున్నది? విద్యార్థులు ఒక రోజు ప్రిన్సిపల్‌ను నిలదీస్తే- రెండు లక్షలతో మీరు కోరిన సౌకర్యం కల్పిస్తాం అని హామీ ఇచ్చారట. ఆ సందడి సద్దుమణిగిన తర్వాత రెండు వేల రూపాయల పని సైతం చేపట్టలేదు. కనీసం లైబ్రరీకి మంచి పుస్తకాలు తెప్పించమన్నా తెప్పించలేదట. దాదాపు పదేళ్ల ఇవతల లా కాలేజి కోసం ఒక కొత్త టేబిల్ సైతం కొనలేదు. విఆర్‌హైస్కూలులోనో, కాలేజిలోనో పాతబడి, మిగిలిపోయిన బెంచీలు, కుర్చీలతో కాలక్షేపం చేస్తున్నారు.

నూరేళ్ల చరిత్ర కల్గిన ఈ వృద్ధ విద్యా సంస్థకు వున్న ఒకే ఒక వృత్తి విద్యా కళాశాల- లా కాలేజి. దానినీ బిల్లాడి కూలీల లెక్కలు వ్రాసుకొని తినడానికి, జీతాలు లేకుండా అయ్యవార్లచేత పని చేయించి శాడిస్టు మానసిక తృప్తి పొందడానికి వాడుకుంటున్న యజమాన్యాన్ని ఏమి చేయాలి? మరొక ఆలోచించాల్సిన ప్రశ్న ఏమిటంటే- కొసరు వంటి లా కాలేజిలోనే ఇన్నేసి లక్షల స్వాహా కన్పడుతుంటె మహా వృక్షం వలె విస్తరించిన అసలు కాలేజిలో ఇంకెంత దిగమింగుడు వుందా అన్నది ! ప్రభుత్వం ఏదైనా స్పెషల్ దర్యాప్తు జరిపితే తప్ప, ఆ నిజాలు బయటపడవు.

## సింహపురి

(4 వ పేజి కొరవ )

ఆఫీసు వరకు 1-10 పైసలు, గవర్నమెంటు ఆసుపత్రికి 1-25 పైసలు, నిప్పో -వేదాయపాళెంలకు 1-50, అయ్యప్పగుడికి 1-75 పైసలు తీసుకొనే వారు . ఆర్టీసీ అయితే చివరి స్టాపింగ్ -అంటే అయ్యప్ప గుడికి అదనంగా మరో 25 పైసలు వసూలుచేస్తుండేది. 17 తేది ప్రైవేట్ బస్‌ల ఛార్జీలు పెరిగిన తరువాత ఆ రేట్లు60 పైసలు . 75 గా. 85 - 1-00 గా. 1-10 1-25గా మారాలి. కాని ప్రైవేట్ టౌన్‌బస్‌ల వారు 1-25పైసల తరువాత స్థిరంగా వుండవలసిన 1-50 1-75 గా 1-75 ని2-00. 2-00ను 2-25గా అనధికారికంగా పెంచి ప్రయాణీకులను దబాయించి మరీ దోచుకుంటున్నారు. ఆర్టీసీ అయితే వీరికన్నా మరో మెట్టు పైన వుంది. చివరికి స్టేజీ యైన అయ్యప్ప గుడికి 2-50 పైసలను అప్పణంగా తీసుకొంటున్నారు. అంతకంటె దారుణమైన దోపిడీ - సింగిల్ స్టాప్‌కు కూడా రూపాయి పిండడం; అమాయక ప్రయాణీకులను దబాయించి, 75 పైసల మినిమం ఛార్జి విద్యార్థులకు మాత్రమేనని బుకాయించి, ఈ దోపిడీ చేస్తున్నారు. ఆటోఛార్జీలతో బస్‌లను పోలిస్తే అవే నయమని పిస్తున్నాయి. అయ్యప్పగుడి నుంచి గాంధీ బొమ్మ వరకు ఆటోల్లో కేవలం మూడు రూపాయలే తీసుకొంటున్నారు. టౌన్ బస్సుల్లోని నరకయాతన, టైమ్ తినేయడం వీటిలో వుండదు. ఆర్టీవోగారేమో తాను వసూలు చేయమన్న ఛార్జీలకన్నా అధికంగా వసూలుచేసినట్లు ప్రజలు ఫిర్యాదు చేస్తే వారిమీద చర్య తీసుకుంటా నంటున్నారు. మరి ఆర్టీవో గారే తమనీపద్ధతిలో ఛార్జీలుపెంచమని చెప్పారని బస్సుల సిబ్బంది చెబుతున్న తీరును ఆయన ఎందుకు ఖండించడం లేదు. ప్రజల ఫిర్యాదుకోసం ఎదురు చూసేకంటె ఆయనే ఒక గంట బస్సులను తనిఖీ చేసి ప్రయాణీకులను ఎంత ఛార్జీ తీసుకొన్నారని అడిగితే అంతా బయటపడిపోదా? ప్రజలకు మేలు చేయాలనే ఉద్దేశ్యమేవుంటె ఈడొంక తిరుగుడు దారులు అవసరంలేదు. ఆయన తన విజయాలుగా చెప్పుకుంటున్న స్టాంపింగుల మార్పిడి, స్త్రీలకు ప్రత్యేక సీటింగ్ ఏర్పాటు ఏమాత్రం అమలు జరుగుతున్నాయో ఆయన ఎప్పుడైనా చూస్తున్నారా?

తమిళ సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో జరిగిన ఎమ్జీఆర్ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న ఎమ్మెల్యే శ్రీ జెకె రెడ్డి

## రిపబ్లిక్‌డే పెరేడ్‌కు నెల్లూరు విద్యార్థి

దేశ రాజధాని ఢిల్లీలో జనవరి 26 తేది జరిగే రిపబ్లిక్ డే పెరేడ్‌లో పాల్గొనేందుకు నెల్లూరుకు చెందిన చేజర్ల సుధాకర రావుకు అవకాశం లభించింది. సుధాకర్ మూలపేటలోని శ్రీ వేణుగోపాలస్వామి కళాశాలలో ఫైనల్ బి.కాం. విద్యార్థి. జాతీయ సేవాపథకం కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటున్నందు వల్ల ఈ అవకాశం కల్పించారట. ఎస్.వి. యూనివర్సిటీ పరిధిలోని కాలేజిలన్నింటి తరఫున పాల్గొనే ఏకైక ప్రతినిధి ఈ విద్యార్థి. ఈ సంవత్సరం మొదటి వారంలో భోపాల్‌లో జరిగిన ప్రీరిపబ్లిక్ డే పెరెడ్ లో పాల్గొని శిక్షణ కూడా పొందార ...న రాష్ట్రం నుండి 14 మంది జాతీయ సేవా పథకం లో పనిచేస్తున్న విద్యార్థులు ఈ రిపబ్లిక్ డే పెరేడ్‌లో పాల్గొంటున్నారు.

## అపోలో ఆపరేషన్లు

నెల్లూరు అపోలో అస్పత్రిలో 60 మంది పోలియో రోగులకు 17,18 తేదిలలో ఉచితంగా ఆపరేషన్లు చేశారు. ఉచిత పోలియో శిబిరానికి వచ్చిన 200 మంది రోగులలో 72 మందికి ఆపరేషను చేయను తాము సిద్ధంకాగా వారిలో 60 మంది ముందుకొచ్చినట్లు హాస్పిటల్ సూపరింటెండెంట్ డాక్టర్ చంద్రశేఖరరెడ్డి చెప్పారు. వీరికి ఆపరేషన్లు నిర్వహించను ప్రత్యేకంగా రెండు ఆపరేషన్ టేబుల్లతోపాటు, ముగ్గురు నర్సుల్ని, ఇద్దరు అనస్తీషియన్లు, మరో ఇద్దరు అసిస్టెంట్లు, 40 మంది సిబ్బంది ని ఏర్పాటు చేశారు. వీరందరికీ ఆహారం, పడక సౌకర్యం కల్పించారు. ఆపరేషన్ చేయించుకొని వారికి వుచితంగా మందులిచ్చి పంపారు.

## వైద్య వుద్యోగుల యూనియన్ మహాసభలు

ఐ.ఎన్.టి.యు.సి అనుబంధ సంస్థ ఆంధ్రప్రదేశ్ ప్రజారోగ్యవైద్య వుద్యోగుల యూనియన్ జిల్లాశాఖ మహాసభలు 24 తేది జరుగనున్నాయి. ఎస్.ఎఫ్.సి. ఛేర్మన్ ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టర్ బి. సుందర రామిరెడ్డి వీటిని ప్రారంభిస్తారు. సమాచార శాఖమంత్రి శ్రీ పసల పెంచలయ్య ఎమ్పీలు మాగుంట సుబ్బరామిరెడ్డి, కుమారి పద్మశ్రీ, ఎమ్మెల్యేలు సి.వి.శేషారెడ్డి, పత్రా ప్రకాశరావు, కలికి యానాదిరెడ్డి ముఖ్య అతిధులుగా పాల్గొంటారు. మధ్యాహ్నం జరిగే వుద్యోగుల సర్వసభ్యసమావేశంలో నూతన కార్యవర్గ ఎన్నిక జరుగుతుందని యూనియన్ జిల్లా కార్యదర్శి ఎ. హరిబాబు తెలియ జేస్తున్నారు.

## పెద్దాస్పత్రి ఉద్యోగుల సంఘం

జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లోని వైద్య వుద్యోగులు తమ యూనియన్‌ను ఐ.ఎన్.టి. యు.సిలో విలీనం చేశారట. దీనికోసం 8తేది జరిపిన సమావేశానికి జిల్లా ఐ.ఎన్.టి.యు.సి వుపాధ్యక్షులు శ్రీ బి. వాసుదేవరావు, ప్రధానకార్యదర్శి ఎస్.ఎ. ఖుద్దూస్, హాజరయ్యారు. ఈ సందర్భంగా 93-94 సంవత్సరాలకు యూనియన్ మెడికల్ విభాగపు కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. అధ్యక్షుడుగా ఆర్.మస్తానయ్య, ఉపాధ్యక్షుడుగా ఎస్. ఎ. గఫూర్, సహ కార్యదర్శిగా ఎస్.కృష్ణమూర్తి, కోశాధికారిగా జె.వి.సుబ్బయ్య, ఎన్నికయ్యారని కొత్త కార్యదర్శి డి. శ్రీహరిరావు తెలుపుతున్నారు.

## టౌన్‌లో నిషేధాజ్ఞలు

అయోధ్య సంఘటనల మూలంగా ముందు జాగ్రత్త దృష్ట్యా నెల్లూరు టౌన్‌లో పోలీస్ 30 వ చట్టాన్ని అమలు చేస్తున్నట్లు ఎస్పీ క్రీటి. కృష్ణప్రసాద్ తెలుపుతున్నారు. ఈ నెల 25 తేది వరకు అమలులో వుండే ఈ చట్టాన్ని అతిక్రమించి రాజకీయపార్టీలు, మత సంస్థలు ప్రదర్శనలు జరపకూడదట.

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.